శ్రీ ర స్తు.

# శ త క ం ఠ రా మా య ణ ము

అను నామాంతరముగల

# సీ తా వి జ య ము.

మ ర్ద న క వి ప్ర ణీ త ము.





చె న్న పు రి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్ర క టి త ము.

1 9 2 6.

# పీఠిక.

సీతావిజయము, శతముఖ రామాయణము, శతకంధర రామాయణమునను మూఁడుపేరులుగల యీ రామాయణము మూఁడుప్రతులనుబట్టి సిద్ధము చేయఁబడినది. అందు మొదటిది ఆంధ్ర పరిషత్పుస్తక భాండాగారములోని కాగితపుప్రతి. రెండవది తాళపత్ర ప్రతి. మూఁడవది విశాఖపట్టణపు ముద్రితప్రతి. పరిషత్ప్రతి, గోదావరి మండలములోని, అమలాపురముతాలూకాలోని అల్లవరములో గుబ్బల సుబ్బారాయఁడు గారు 1903 సంవత్సరమున వ్రాసినది. రెండవ తాళపత్రప్రతి హేమలంబి సం॥ ఫాల్గున బ ౧౪ లగాయతు విలంబి సం॥ చైత్ర శు ౧౨ వఱకు పత్యే పిచ్చెయ్యగారు వ్రాసినది. మూఁడవది 1904 సం॥ నచ్చుపడినది. ఈగ్రంథముయొక్క కర్తలనామములను గుఱించి కొంత వివాదమున్నది. తాళపత్రప్రతిలో, ముద్రితప్రతిలో, దొరతనమువారి పుస్తకభాండాగారములోని **S/5-2-19** లోను మర్ధయకవియనియు, పరిషత్ప్రతిలోను, దొరతనమువారి పుస్తకభాండాగారములోని **K. 1-44** లోను లింగకవియనియు నున్నది. మఱియు నందేకల 12-1-37 లింగయ్య రంగయ్య కవులచే రచియింపఁబడినదని ముద్రితపట్టికలోనున్నది. కీ. శే. కందుకూరి వీరేశలింగము పంతులుగారి కవులచరిత్రములో లింగకవి గంగకవి యను నిరువురుకవులు రచించినట్లుగలదు. కవులచరిత్రములోనివాక్యము లీక్రింద నిచ్చుచున్నారము.

"ఈయిరువురు కవులునుం జేరి సీతావిజయమను నామాంతరముగల శతముఖ రామాయణమును రచించిరి. ఈయిరువురుకవులు వేదాద్రిపురనివాసులు. వీరిలో నీలకంఠోపాసకుఁడైన లింగకవి తాను రచించిన మొదటి మూఁడాశ్వాసములను చిన్నారెడ్డి పుత్త్రుఁడగు పోచనృపాలున కంకితముచేసెను. నృసింహోపాసకుఁడగు గంగకవి తానురచించిన నాలవయాశ్వాసమును భోగనృపాలుని కంకితము చేసెను. ఈయిరువురు కవిత్వమును మొత్తముమీఁద రసవంతమై నిర్దు

ష్టమై హృదయంగమముగానున్నది. ఈకవు లిన్నూఱుసంవత్సరములకు ముందున్నట్లు తెలియవచ్చుచున్నది." అని.

మూఁడువ్రాఁతప్రతులలో మర్దనకవి యనియుండుటచే నెక్కుడు ప్రతులలోనున్నదని యాపేరేయుంచినారము. ఈచిక్కున కంతకును గారణము పీఠిక కృత్యాదిపద్యము లొక్కప్రతిలోను లేకుండుటయే కావున, వాస్తవము తేలదు. ఎంతవఱకు లింగనకవిత్వమో యెంతవఱకు గంగనదో, రంగనదో విడఁదీయుటకు వలనుగాలేదు. అట్లే పోచన్నపాలునికిఁ గృతియెంతవఱకో భోగన్నపాలున కెంతవఱకో బొత్తిగాఁ దెలియవచ్చుటలేదు. ద్విపదకావ్య మొక్కటి లింగకవిది పరిషత్పుస్తక భాండాగారములోనున్నది. విషయనిర్ధారణము పీఠిక పద్యములు చదివినవేత్తలు చేయవలయును. మనయాంధ్రకవులు కృత్యాది నిష్టదేవతా వందనములు కృతిపతికృతికర్తల వంశావళులు వర్ణించుటలో నెంతపట్టుదలగలవారో, యట్లే మనవ్రాయసకాండ్రును బీఠిక పద్యములను దొలఁగించి ప్రతులువ్రాయుటలో నంతపట్టుదలగలవారు. చారిత్రక విషయమునందు బొత్తిగా విముఖులగుటకుఁ జింతిల్లుచున్నారము.

ఈగ్రంథమునందలి కవనధోరణినిబట్టి మాత్రము పలువురు రచించినట్లూహింపఁదగును. కవులచరిత్రము వాడుకప్రకారము "మొత్తముమీఁద రసవంతమైనదని" చెప్పినను గద్యములోఁ గవి తానుస్వయముగ, బ్రతిభాశాలినని వ్రాసికొన్నను, అంతమంచిధోరణి గలదిగా నగపడదు. ఔచిత్యము, సందర్భము తక్కువగానున్న భాగములు కొన్నిగలవు. అపప్రయోగములు "అల్కతో, కొన్నబ్దములకు, వెక్కసైసొక్కు, ముఖతీక్ష్ణాస్త్రవివిధాశుగము, క్షీరాబ్ధి దాఁటవ్వాలన్, నీకు గొబ్బునసిత్తుమ్, చిత్రగంధిట్లనియెన్, భూమంతటన్, బలస్ఫూర్తింజనుందేర, రతీశోరమణున్ రథంబు, నిల్చికురించె మహాస్త్రవర్షమున్, దనుజుఁడొనర్చు బాణములు" మొదలైనవిగలవు. పురపురంధ్రీజనులు సీతను స్తుతించుట పారిజాతాపహరణములోని స్వర్గస్త్రీల వర్ణనమువలెఁ గనఁబడుచున్నది. కొన్నిపద్యములు సంస్కృత జటిలములై యున్నవి. నిరర్థపదభూయిష్ఠములుగాఁ గొన్నిగలవు. పాఠకులు గ్రహింపఁగలరు.

ఇందు సేనలకు వెల్వాలను ప్రయోగముగలదు. వెల్లువలని కావచ్చును. ద్వితీయాశ్వాసములో—సీ. శతకోటిలక్షలు శైలచరావళుల్ గదిసిన మొన యనఁగాను బరఁగు-అనుపద్యములో వెల్వయనుసంఖ్య యింతయని చెప్పఁబడినది. శ్రీరామునిసేన డెబ్బదిరెండు వెల్వాలని వాడుకగలదు. ఈవిషయమై పెద్దలుచదువు రెండుపద్యములున్నవి. ఈవెల్వ యక్షోహిణివంటిది.

మ. "మదినూహింపఁగ స్వామికన్న నీక సామంతుండు లేఁ డెందు డె
బ్బదిరెం డ్వెల్వలసేన చుట్టుఁ గొలువన్ బాహాబలుండయ్యుఁ దాఁ
దుదిమై రావణుచేతఁ జిక్కువడె..."

సీ. "కోఁతు లెనుబదికోట్లు కొమరొప్ప నొకగంతు
గంతులు వేయి నిక్కంపుగమియు
గమికోటి కోటియుఁ గలయంగ మొత్తంబు
మొత్త మర్వదికోట్లు మొనసి వీడు
వీడు లక్షక్షోణి వెలయంగ నొకసాదు
సాదు డెబ్బదిరెండు సకలమూఁక
మూఁకలు శతకోటి ముదముతో సంగడ
సంగడమే వేయి సరగఘట్ట
ఘట్ట మర్వదికోట్లు తగిలింప నొకమొన
మొనలు మున్నూటికి మొనయుఁ దోయ
ఇట్టి తోయలు నారైన గట్టి యూథ
ఇట్టి యూథలు నారైన నెసఁగు వెల్వ
ఇట్టి వెల్వలు డెబ్బదిరెంటితోను
రామచంద్రుండు వేంచేసె లంకమీఁద." అని.

ఈపద్యములం దీయఁబడిన లెక్కకును మనగ్రంథములోఁ జెప్పఁబడిన లెక్కకును సరిపడుటలేదు. పరిషత్ప్రీతిని బట్టి యిందు విశేషపద్యములు చేర్పఁబడినవి. అందుఁ గొన్నివచనములకుఁ బద్యములుగలవు. ఒకపద్యమునకు వేఱొకపద్యములో నాయర్థమే చెప్పఁబడియున్నది. పలువురు పాఠకులకోరికపై సన్నియు నొక్కగ్రంథములోఁ గనఁబడునట్లు

శ్రమపడి యీ ప్రస్తుతప్రతిని సిద్ధము చేసినారము. కాని పాఠకులనిమిత్తమై యతిశీఘ్రముగా ముద్రించుటచే నక్కడక్కడఁ గొన్ని లోపము లుండవచ్చును. పాఠకులు మా శ్రమకుఁ దగినఫలము గలుగునట్లు బ్రోత్సహింతురు గాకయని కోరుచున్నారము.

తండయార్పేట
చెన్నపట్నము.

ఇట్లు,
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

శ్రీ ర స్తు.

# శ త కం ఠ రా మా య ణ ము

## ప్ర థ మా శ్వా స ము.



ఉ. భాసురలీల శంభుఁడు కృపారస ముప్పతిలంగఁ జారుకై
లాసమునందుఁ బార్వతికి రామకథల్ వివరింప నందుచే
వాసిగ సంతసిల్లి నిజవల్లభుపైఁ దనచూడ్కినిల్పి యో
దాసజనావనాత్మక ! సదాశివ! యింకొకటానతియ్యవే. 1

మ. శతకంఠుం డనుఘోరదైత్యుఁడు రఘుస్వామిన్ రణంబందు నే
గతిమైఁ దల్లడిలంగఁజేసె? నటఁ దత్కాంతాలలామంబె య
ల్కతో వీక్షించి పెనంగెనెట్లు? మఱి తత్కాండప్రచండక్రియన్
మృతుఁడై యేవిధిఁ గూలె? వాతఁ డది పేర్మిం దెల్పుమా వేఁడెదన్. 2

గీ. ఎవ్వఁడా [1]రామచంద్రుని నిచ్చఁదలఁచు, నెవ్వఁడాసీతమహిమంబు లెఱుఁగఁగోరు
నాయురారోగ్యములు వానికతిశయిల్లుఁ, దాండవంబాడులక్ష్మి యాతనిగృహమున.

క. ఈచరిత రాఘవునిదఁట, యీచేతను బుట్టె నారి యీమహిమ మొగిన్
నీచేతఁ బలుకఁబడెనఁట, చూచిన వ్రాసినను విన్న శుభమింపొందున్. 4

వ. అనినవిని సర్వజ్ఞుండగు మహాదేవుండు సమ్మతించి పులస్త్యప్రకారంబును [2]తత్సుతుల విశ్రవసాశ్రమలవిధంబును రావణకుంభకర్ణవిభీషణాదులజననంబును అన్నకొడుకులంజూచి యశ్రమంబు వగచుటయు, తపంబుసేయుటయుం, తత్ప్రభావంబున నూఱుశిరంబులు నిన్నూఱుకరంబులుంగల మహాదానవుంగనుటయు, నతండు రామునిచేఁ దెగిన రావణాద్యఖిల దనుజప్రళయంబును వినుటయుం, నప్పగ యీఁగఁగోరుటయు, తపంబు సేయుటయుం, నజుండుపొడచూపుటయు, నతనివలన దుర్లభంబులగు వరంబులు గొనుటయు, మునులబాధించుటయు, నమ్మునులు రామచంద్రునిపాలికిం జని శరణుచొచ్చుటయు, వారికినభయహస్తంబులిచ్చుటయు, శతకంఠునిం జంపఁబ్రతిజ్ఞ సేయుటయుం, మునులఁబంపుటయు, వెనుక నమ్మహాదనుజుని విక్రమంబు[3]దలఁచి బలసా

---

1 రాఘవేంద్రుని. 2 తత్సోధుచక్రపరాక్రమవిభవంబును. 3 విని.

మగ్రి చాలదని వగచుటయు, లక్ష్మణుండు తమతమపరాక్రమంబులు దెలుపుటయుం, విభీషణుని రాఁదలఁచుటయు, నతనివలనఁగొన్ని వివరంబు లెఱుంగుటయు, [1]హనుమంతునిఁ దలంచుటయు, నతనికిఁ దద్వృత్తాంతంబు సెప్పుటయు,నక్కపికులోత్తముండు తన మహారూపంబు సూపుటయు,సకలమనుజదనుజవనచరబలంబుల రప్పించుటయు, తన్నుంగొని చనుమని సీత వేఁడుటయు, రాఘవుం డనుమతించుటయు, దండు వెడలుటయు, నందఱ నొక్కపెట్టున హనుమంతుండు తనశరీరంబునం దాల్చుటయు, దేవతలు సన్నుతించి పుష్పవర్షంబు గురియించుటయు, నందులకు మిగుల నుత్సహించి పవనజుండు తనవాలంబున నఖిలదళంబుల సముద్రంబులు దాఁటించుటయు, లగ్గపట్టుటయు, హనుమద్రాయభారంబును, చిత్రగంధినీతియు, ద్వంద్వయుద్ధప్రకారంబును, సకలబలప్రళయంబును, రాముండును శతముఖుండునుం దలపడి ఘోరయుద్ధంబు సలుపుటయు, నందులకు రాఘవుండు కళవళించుటయు, సీత విల్లందుటయు, దనుజబలసంహారణంబును, శతకంధరు పరాభవంబును, మఱునాఁ డరుదెంచుటయు, నారదాగమనంబును, హితోపదేశంబును, బ్రహ్మాస్త్రప్రయోగంబును, శతముఖుమరణంబును, చిత్రగంధివిలాపంబును, నీలకేతను పట్టాభిషేకంబును, హనుమంతుండు మరల జలధులు బలంబులు దాఁటించుటయు, పురంబు చేరుటయు, రాజ్యంబు పాలించుటయు మొదలుగా నంతయుఁ దలపోసి మందస్మిత ముఖారవిందుండై యిందుశేఖరుండు పార్వతీదేవి కిట్లనియె. 5

క. రావణుఁ డురుసంగరవి, ద్రావణుఁ డాభీలబాహుదండజితోగ్ర
రావణుఁడు సేయునురుదు, ర్భావపరాభవము లాత్మ భావించి సురల్. 6

గీ. క్షీరవారాశికడకేగి శ్రీరమాధి, నాథుఁ[2]బొడగని కని వందనము లొసఁగి
తమపరాభవ మెఱిఁగింపఁ గమలనాభుఁ, డభయకరమిడి పనిచెఁ గొన్నబ్దములకు. 7

గీ. దేవతలఁ బ్రోవ నాత్మఁ జింతించి పంక్తి, రథ మహాగర్భ దుగ్ధాంబురాశియందు
నొనర సత్సంతతికి మోదమొదవ రామ, చంద్రుఁడుదయించెఁ బూర్ణిమాచంద్రుపగిది.

వ. ఇట్లుదయించి. 9

సీ. ధరణీ[3]ధరాటకఁ దాటకఁబడనేసి జన్నంబు బన్నంబు చక్కఁజేసి
ఖ్యాతిగా రాతిని నాతిగాఁ గావించి భవునిచాపంబు రూపంబుమాపి
సీతను భాగ్యసమేతను బెండ్లాడి కైకవాక్యమున కైక్యంబునొంది
గుహుని సద్ధర్మహృద్గుహుని సంభావించి రాష్ట్రాపరాధువిరాధుఁ [4]గొట్టి

---

1 వాయుజునిరప్పించి యతనికిఁ దద్వృత్తాంతంబు. 2 బొడగాంచి వినయవందనతు లొసఁగి. 3 ధరాధిక. 4 గిట్టి.

గీ. ఘనులమునులను మన్నించి కడుఖరాఖ్యు, దూషణుని భీషణాంబకాదులనుగూల్చి
యొక్కరక్కసి వెక్కసై సొక్కుదాని, ముక్కు సెవులకుఁ గలనిక్కు చక్కుఁజేసి.

శా. మారీచుం బడనేసి వాయుజుని [1]సన్మానించి కిష్కింధకున్
నీరేజాప్తజు రాజుఁజేసి [2]యలకంథింబూని బంధించి బల్
నారాచంబులఁ బంక్తికంఠఘటకర్ణశ్రేణి [3]హింసించి లం
కారాజ్యంబున నవ్విభీషణుని భాగ్యప్రాప్తుగా నిల్పుచున్. 11

ఉ. వారిధి వానరాళిగొలువంగను గ్రమ్మఱదాఁటి సీతయుం
దానును లక్ష్మణుండు నవధానవిమానము నెక్కి వేల్పులున్
బోరనఁ బువ్వుముల్ గురియఁ బొంగుచు వైరివిదారధీరగం
భీరమనస్కులై చనిరి పెల్లుగఁ దల్లులఁ జూచువేడుకన్. 12

క. పురజనులు సంతసిల్లఁగ, నిరుపమసత్కీర్తిలక్ష్మి నెగడఁగ సద్భా
సురులు నుతింప నయోధ్యా, పురమున కేతెంచి రధికపురుషవరేణ్యుల్. 13

వ. ఇట్లు చనిచని నిరంతరకుసుమఫలభరిత తరునిచయారామంబులును, విమలకమలకహ్లారషండమండిత జలాశయంబులును, అభేద్య పరిఖాప్రాకారద్వార కవాటమణితోరణ విరాజితసౌధాగ్రబంధబంధుర శాతకుంభ సముదయంబులును, హాటకవిరచిత నూత్నరత్నదీప్తి ధగద్ధగాయమాన రాజప్రాసాద ప్రాంగణరంగసంగత కనకమంటపావరణ విచిత్రకుడ్య గవాక్షసంశోభితంబులును, వీరకుమార సుందరమందిర పశ్చిమభాగసంస్థిత కేళికాకుధరనిత్యనివాస కీరమయూరశారికా పికప్రకట కోలాహలంబులును, అనవరతమదజల పంకసంకలిత గండమండల శుండాల[4]జాలంబులును, జవవిజితపవనమనోవేగరంగత్తుంగ తురంగంబులును, అవక్రమణి చక్రాగణిత ఘంటికాఘణఘణారవాభ్రంకషధ్వజ సకలసాధనాయుత రథనిచయంబులును, సంగరాభంగ వీరాలాపప్రతాప భటకదంబంబులును, రంభాసంభోగారంభ విజృంభమాణవిభవగంభీర వారవనితా సంఘంబులును, సమస్తరాగోపరాగతానమానావధాన మంగళపాఠక మహిమంబులును, అభ్రంకష గోపురప్రాకార చతుర్ద్వార భవనతరళిత వృషభకేతన నానాధూపధూమఘుమఘుమాయమాన వాసనావాసిత దేవాలయంబులును, భేరీమృదంగశంఖకాహళపణవఢక్కాముఖానేక వాద్యఘోషంబులును, ప్రజ్ఞావిశేషనిర్జిత శేషభాషాధీశులగు విప్రవర్గంబులును, •సమరపరిచ్ఛేదితో

1 సంభావించి. 2 జలధి న్నిక్కంబుగా దాఁటి. 3 దూరించి. 4 తండంబులును.

రథ్యలనిమ్నీకృత భూషణభూషిత క్షత్రియకుమార వారంబులును, ధనకనక వస్తు వాహనప్రవర్ధమాన వ్యవహారహసిత ధనదాదులగు వర్తకులును, అక్షుద్రభద్రతర శాశ్వతైశ్వర్య తిరస్కృత సముద్రులగు శూద్రులును గలుగు సాకేతనగరంబు ప్రవేశించి, అనర్గళ సంభ్రమాయత్తచిత్తుండై రఘువరుండు మక్కువ నొక్కనాఁడు శుభముహూర్తంబున ననుజపరివృతుండై మునిజన పురోహితామాత్య జననీత్రయాను మతంబున జానకీసమేతుండై. 14

క. పట్టాభిషిక్తుఁ డయ్యెను, నెట్టన భువనములఁ గలుగు నృపతులు మెచ్చన్
ఘాట్టప్రాభాకరశా, స్త్రోట్టంకితు లైనసుకవు లొనర నుతింపన్. 15

గీ. ఇట్లు పట్టాభిషిక్తుఁడై యేపుమెఱసి, దనుజవిదళనబిరుదపద్యములు వినుచు
నెల్లజనములు ముదమొంద నేలుచుండెఁ, [1]దల్లి దండ్రియుఁ దైవంబుఁ దానెయనఁగ.

సీ. ధర్మంబు నాల్గుపాదంబుల వర్తిల్ల వాంఛించినప్పుడే వానగురియుఁ
దరువు లేవేళ నుద్ధతిమీఱ ఫలియించుఁ బైరులు దున్నక పండుచుండుఁ
దిరిపంబువిరస మేదిక్కు ననొదవదు మొదవులు పిదుకకమున్నె పిదుకు
వ్యాధులు నఘములు వలసలై దూరించు: జింతింపఁ గోర్కులు సిద్ధినొందు

గీ. రాజపరమేశ్వరుఁడు దైత్యరాజహరుఁడు, రాజసింహుండు దశరథరాజసుతుఁడు
[2]రాజసదృశకళాంగుఁడు రాఘవుండు, ఘనతతోఁ బుడమిఁ బాలించుకాలమునను. 17

గీ. గట్టిధాన్యంబు పోఁకకుఁ బుట్టెఁ జేసి, యట్టిపోఁకలు రూకకు ననికెఁ జేసి
యట్టిరూకలు మాడకు నఱువ జేసి, యట్టిమాడలు వింటింట నగణితములు. 18

గీ. సకలజనములు సేవించి సన్నుతింపఁ, బ్రకటముగ రాజ్యసౌఖ్యంబుఁ బాలనంబు
సల్పుచుండెను రఘురామచంద్రుఁ డవని, గీర్తి వర్ధిల్ల సద్గుణస్ఫూర్తి దనర. 19

క. మేఘశ్యామలదేహుఁడు, రాఘవుఁ డీరీతి భూసురస్ఫుటభాషా
మోఘాశీర్వాదమహా, శ్లాఘామతి నేలుచుండుసమయమునందున్. 20

చ. శతముఖనామధేయుఁ డొకచండనిశాచరలోకనాథుఁ డు
గ్రత నలపంక్తికంఠఘటకర్ణపురందరజిత్ప్రహస్త లీ
క్షితిఁ బడుటంతయున్ హితులచే విని రామునిమీఁద నాదటన్
ఘృతయుతపావకాకృతిని గెంటకమండుచు హుంకరించుచున్. 21

గీ. మెఱసి బ్రహ్మాండమెల్లను మ్రింగ నట్టి, వాస మొనరించి వక్త్రగహ్వరముఁ దెఱచెఁ
దెఱవ నురవడి నర్కుండు తెరువుదప్పి, యురవుగాదని మేఘునిమఱువుఁ జొచ్చె. 22

---

1 దల్లియును దండ్రియును దాన. 2 రాజసద్యుతికాంగుండు; రాజసదృశకరాంగుఁడు.

ఉ. అగ్గలమయ్యె మ్రోఁత [1]జగదంతరమందునఁ దద్భయంబుచే
దిగ్గజపంక్తి బ్రగ్లె [2]మఱితేఁకువలేక సమస్తజీవముల్
మ్రగ్గెఁ బయోనిధుల్ గలఁగె మ్రాన్పడె నబ్జభవుండు నాసుధా
భుగ్గణమెల్ల భీతిలెనుబోరున రామజయంబు గోరుచున్. 23

వ. మఱియు నయోధ్యాదిపట్టణంబుల మహోత్పాతంబు లుద్భవించె; *శతముఖుండును డెందంబున నందంద విచారించి రాముండను నొక్కనరునిమాత్రంబునకు సకల లోకంబులు పరిమార్పనేల? వానికి గోబ్రాహ్మణదేవతాదులు ప్రియంబులనివిందు నటు గానఁ దత్పరిహారణంబులు గావించెద; రాముం డనువాఁ డందుకు నడ్డపడవచ్చెనేని పగదీర్చుకొనెదఁగాక యని. 24

గీ. మదినిఁ బొదలుచు ఋష్యాశ్రమములు సొచ్చి
డాసి మఱియును హోమగుండములు వ్రాడ్చి
యాగధేనువులను ద్రుంచి పూగముఖ్య
భూజములు ద్రోసి కాసారములు గలంచి. 25

క. మునిసతులఁ జెఱలుగొని యా, మునివరులను దునుమఁ జిత్తమున రోసి తుదిన్
వనలతల మునులకరములు, ఘనముగ బంధించు వికృతకఠినముఖుండై. 26

క. నెపమేమియుం లేకయె తన, [3]రపమై శమబాధపఱుప రాక్షసుమీఁదం
గుపితాత్ములయ్యుఁ దపసులు, శపియింపఁగఁ జాలరైరి జలజజుమహిమన్. 27

సీ. ఒకమునివరుఁ బట్టి యూర్ధ్వపుండ్రమునాకు నొకవిప్రుజందెంబు లాడిసి త్రెంచు
నొకమానిపైఁ జల్లు నుర్వీపరాగంబు నొక్కతాపసునోరు [4]నొక్కి మూయు
నొకఋషీశ్వరుపిల్లసిక వెల్లగిలఁదీయు నొక్కయోగీంద్రుని యక్కుఁ జదుము
[5]నొకమహీసురుమీఁద నుమియును మత్తుచే నొక్కదిగంబరు నొలయఁ దన్ను
గీ. [6]నొకతపోధనుఁ డేతెంచి వికలమతిసి, పెక్కుమాఱులు శతముఖు పేరు నొడివి

1 వాదెడంతచయంబుల నద్భుతంబుగా. 2 మదితెప్పిరలేక. 3 డపమై దమబాధ పఱుప ధార్ష్ట్యముహూఱక. 4 ముక్కు యూరెను. 5 నొకదిగంబరు బట్టి సికలాగు మిన్నంద నొక్కయతీంద్రుని నొడిసి తన్ను. 6 ఒకతపోధనుపైఁబడి యంఱిమిగొట్టి.

*చ. శతముఖుఁడు స్వనంబున విచారముచేసెను రామభద్రుపై
మతిచెడి లోకమెల్లఁ బరిమార్పఁగ నేటికి రాముఁగోసమై
హితవుగ నున్న వేల్పుల మహీసురులన్ వధియింప నప్పుడే
శతముఖవచ్చి యుద్ధపడఁ బైకొని రాముని సంహరించెనెన్.

పాహి పాహి [1]యనుచు సాగఁబడిన నతని, కాలు [2]గొనియీడ్చుచుఁ దుదఁ దానె కాలుపగిది.

ఉ. భూసురు లిండ్లకేగి పటుభూరిభయంకరరూపుదాల్చి తా
బాసరయొనర్చి వేదములు బాగవచించెడువిప్రవత్సలం
గాసరకూసుచేసి పరకాంతల మర్మములెల్ల నంటుచున్
మోసముపుచ్చి పండితుల మోరలు దన్నుచు ధిక్కరించుచున్. 29

సీ. దిక్కుంభికుంభముల్ ద్రొక్కులు గావించు నుక్కునఁ జెలరేఁగి యొక్కనాఁడు
తనబాహుకండూతి దప్పఁ గులాద్రుల నుంకించి పెకలించు నొక్కనాఁడు
తపియింపఁజేసె నాతపమున నని భాను నొడయఁగా నూహించు నొక్కనాఁడు
శౌలయరాదని పూని మలయమారుతమును నుప్పున నెగనూఁదు నొక్కనాఁడు
తే. ఉరగులనుబట్టి దండించు నొక్కనాఁడు, ఉగ్రుఁడై నిర్జరులఁ ద్రోలు నొక్కనాఁడు
ఉదరి మానవులను మ్రింగు నొక్కనాఁడు, ఉర్వి లోకంబు గాలించు నొక్కనాఁడు.

క. ఈవిధిని లోకభయదము, గావించినఁ జిత్తములను గళవళపడి యా
దేవతలు మునులు ధరణీ, దేవతలునుగూడి జాలిఁ దేలుచు [3]లోనన్. 31

క. ఎవ్వండు మనకు దిక్కిఁక, నెవ్వం డీబాధమాన్పు నిల యెవ్వనిచే
[4]నివ్వికృతుఁడీల్గు నెవ్వని, మవ్వపుఁగరుణారసమున మనులోకంబుల్. 32

వ. అనుచు దుశ్చింతాసముద్రంబున మునింగి యపరిమిత[5]డోలాందోళితమానసులై
క్రమ్మఱ ధైర్యంబులఁ బురికొల్పుకొని సురలు మునివరుల కిట్లనిరి. 33

క. కోసలదేశమునందున, భాసురముగ నొప్పు నొక్కపట్టణమందున్
వాసిగనుండు నయోధ్య, వాసుఁడు శ్రీరాముఁ డుండె వాసవునీడై. 34

క. మును మనకొఱకై దానవ, హననమునకు విష్ణుఁ డవని నలరి దశస్యం
దనునకుఁ బుట్టె రఘూద్వహుఁ, డన నిపుడున్నాఁడు గాదె యధిక తెఱుంగన్. 35

గీ. అట్టిరాఘవుఁ డఖిలరాజాధిరాజ, చారుకోటీరమాణిక్యచాకచక్య
సారిమండితసత్పదాంభోరుహుండు. యితఁడె మనకిఁక దిక్కుగా కొండు గలఁడె? 36

ఉ. శ్రీరఘురామమూర్తి సరసీరుహనేత్రుఁ డమేయుఁ డాద్యుఁ డుం
దారయశోవిశాలఘనసాంద్రమరాళతుషారహారక
ర్పూరపటీరవారిహిమభూధరశారదచంద్రచంద్రికా
తారసిభస్ఫుటస్ఫురవితానశుభాంగుఁడు జక్కగాపుతన్. 37

---

1 యటన్నఁ దాఁ బాపమనక. 2 పట్టీడ్చు. 3 నొకటన్. 4 నివ్విపరీతపుదైత్యుం, డెవ్వనిచే నీల్గు మనల కెవ్వరు గలరో. 5 డోలాయమానమానసులై.

మ. దశదిగ్భాగములం బ్రకాశమహిమల్ దట్టంబుగా నిండ న
ద్దశకంఠస్ఫుటకంఠపంక్తి సమరోద్దండాగ్రహాఖీలక
ర్కశభల్లంబుల సంహరించి మనలం గాపాడఁడే? యట్టి[1]పి
రశిరోత్తంసమె దిక్కు దీనికి విచారంబేల యూహింపఁగన్. 38

సీ. తనభక్తుఁ డొంటిఁబోఁ దలఁపఁ దమ్ముఁడుఁ దాను దోడయ్యె రామచంద్రుండుగాఁడె
కులహీనుఁడనక మక్కువమీఱ నొకకిరాతునిబ్రోచె రామచంద్రుండుగాఁడె
మర్కటుండనక నయ్యర్కజుఁ బట్టభద్రునిఁజేసె రామచంద్రుండుగాఁడె
[2]తనశత్రుఁడనక నాదైత్యుతమ్మునిఁగాచె రూఢిగా రామచంద్రుండుగాఁడె

గీ. యట్టికరుణాపయోనిధి కట్టిసుకృతి, [3]కెలమి మీఱంగ మనలను నేలు టెంత?
తడయ కచ్చోటికేగుఁడీ తపసులార, జాగుసేయంగ నేటికి? సభ్యులార. 39

వ. *ఏమును దివినుండి పొడచూపెదమని చెప్పి సురలు నాకంబున కరిగి రంత. 40

శా. †శాండిల్యుండును జహ్నుమౌనివరుఁడున్ జాబాలియుం గౌత్సుఁడుం
గౌండిన్యుండును గాలవుండును మహాకణ్వుండు మైత్రేయుఁడున్
మాండవ్యుండును మందపాలుఁడును సన్మాన్యప్రభావుండు మా
ర్కండేయుండును గూడివచ్చి రతిశీఘ్రంబొప్ప రాముంగనన్. 41

వ. ఇట్లు రయంబున వచ్చివచ్చి. 42

క. ఆతతముగఁ గాంచిరి సా, కేతము వరనృపతిజనని కేతన మతివి

---

1 సద్రసికోత్తంసమె. 2 తనశత్రుఁ డనక వైశ్యతనయుఁ గాచెను; దానవుం డితఁ డంచు దయతప్పకను దొడ్డదొరఁజేసె రామచంద్రుండుగాఁడె. 3 శరణుసొచ్చిన రక్షణసల్పు టెంత.

*గీ. ఏము దివినుండి పొడసూపెదము మీరు, సర్వఋషులును శ్రీరామచంద్రు కడకుఁ
బోయి యీబాధ యతనితోఁ బొసఁగఁజెప్పు, నెమ్మిమీఱంగ సుంత్ర మునీంద్రులార.

వ. అనిచెప్పి దివిజులు నాకంబున కేగిరంత.

†సీ. శాండిల్య కౌండిన్య జహ్నులు జాబాలి కణ్వుండు గశ్యపగౌతములును
గౌతమ గాంగేయ కపిల మార్కండేయ యాత్రేయతుల్యులు [illegible]
వాలఖిల్య వసిష్ఠ నాముసబుషిశ్రేష్ఠులు [illegible] సాంఖ్య విభాండకులును
మైత్రేయ యజ్ఞులు మందపాలుఁడు యాజ్ఞవల్క్య [illegible]

గీ. రోమహర్షులు వృశ్చికరోమముఖాని, మొదలుగాఁగల మునిపంక్తి మోదమలర
రమ్యచారిత్ర [illegible] రాజపుత్రు, [illegible]

ఖ్యాతము నీప్సితవస్తు, వ్రాతము నసమానవైభవసమేతంబున్. 43

ఉ. కాంచి తదీయదివ్యపరిఖావిశదత్వముఁ గోటపాటముం
గాంచనగేహపంక్తియును గంధగజాశ్వరథోత్ప్రవారముల్
మించిన వేడ్కఁ జూచుచును మెల్లన వీడ్కొని తత్పురీంద్రమ
ధ్యాంచితసీమ నొక్కకనకాయతసౌధముగాంచి మెచ్చుచున్. 44

క. ఆమందిరమధ్యంబునఁ, గోమలచకచకలఁ దనరు గురుమణిగణశో
భామయ మగుసింహాసన, మా మునిపుంగవులు గనిరి యతిహర్షమునన్. 45

సీ. కలితపుణ్యచరిత్రుఁ గంజాతనిభనేత్రు జలధరదేహు నాజానుబాహుఁ
గరుణాకటాక్షు శృంగారసుందరవక్షు సత్యసంశీలు విశాలఫాలు
స్మితముఖాంభోజు నాశ్రితజనసురభూజు హారకేయూరు 1వికారదూరు
రవికోటిసంకాశు రాక్షసేంద్రవినాశు భువనప్రశస్తు నద్భుతగృహస్థు
గీ. సమరతలభీము బుధజనకుముదసోము, వినుతసుత్రాముఁ ద్రైలోక్యవిమలనాము
జానకీరాము నృపకులసార్వభౌముఁ, గనిరి మానులు కన్నులకఱవుదీఱ. 46

సీ. వీఁడఁటే కృపమీఱ వేల్పులకోఱకునై మహిమీఁదఁ బుట్టినమాయలాఁడు
వీఁడఁటే దశరథోర్వీ2భర్తకు మిగుల సుద్దుల నుబ్బించుముద్దులాఁడు
వీఁడఁటే చిన్నినాఁ డేడాసి వెక్కసి రక్కసిఁ జెక్కినరట్టుకాఁడు
వీఁడఁటే గాధేయుని విమలతరాటోపయజ్ఞంబు రక్షించుయజ్ఞభోక్త
గీ. వీఁడఁటే శౌర్యములకెల్ల పీఁటపట్టు, వీఁడఁటే ధర్మములకెల్లఁ దోడఁబుట్టు
వీఁడె సాక్షాత్కరించిన విష్ణుమూర్తి, వీనిఁ గనుకంటె శుభములు వేఱకలవె. 47

వ. అని మునీంద్రులు సాంద్రకరుణారసపరిపూర్ణహృదయులై వివిధాశీర్వాదమంత్రా
క్షతవస్త్రశస్త్రహస్తంబులెత్తి భక్తితోఁ గదిసి యుల్లసిరి. 48

సీ. చిరమస్తు ధరణిజాశ్లిష్టభుజాదండ భండనోద్దండ కృపాప్రచండ
విజయోస్తు త్రిభువనవిఖ్యాతచారిత్ర వికచాబ్జనేత్ర పవిత్రగాత్ర
దీర్ఘాయురస్తు భూదేవతామందార కలుషసంహార భాగ్యప్రచార
ఆరోగ్యమస్తు శతార్కతేజోరూప గుణజయాతీతోప సద్గుణకలాప
గీ. అనుచు నాశీర్వదించి 3మంత్రాక్షతల్ ప్ర
సూనశుభఫలాబ్జముఖ్యవస్తువు లొసంగి

1 రమ్యప్రచారు. 2 భర్తకును బెన. 3 మంత్రాక్షతాది సూనసుభగరాజితం.

భయముఁ బ్రియమును జయమును రయము నయముఁ
బెనఁగొనఁగనిల్చి రారాముఁ [1]బ్రేమఁగనుచు. 49

వ. రాఘవేశ్వరుండును బ్రత్యుత్థానాభివందనము లందఱకును వేఱువేఱ నాచరించి అర్ఘ్యపాద్యాదివిధులం బూజించి ఉచితపీఠంబుననుండ నియమించి మందస్మితముఖారవిందుండై యానంద మందంద సందడింప సంతసంబుగా మెల్లన మునివరుల కిట్లనియె. 50

శా. అయ్యా మావిభవంబులెల్ల భవదుద్యత్పూతపాదాంబుజా
శ్రయ్యాలోకనచింతనంబునఁగదా జానొప్ప నీడేఱు మీ
రెయ్యేతావుల కేగుదెంతు రెటమీరీక్షింతు రింపొందఁగా
నయ్యాతావులు వృద్ధిఁబొంది మనుటే మాశ్చర్య మూహింపఁగన్. 51

శా. క్షేమంబేకద మీకు మీపరిజనుల్ శిష్యుల్ విడంబింతురే
నేమంబొప్పఁగ ధేనువుల్ పితుకునే నిత్యోత్సవక్రీడలన్
వేమాఱున్ ఫలియించునే తరువు లుర్విన్ సత్తపో[2]ధర్మముల్
ప్రేమన్ వర్ధిలునే నిరంతరముఖాభీష్టంబు లీడేఱునే. 52

శా. దైన్యంబేమియులేక మీకరుణ నిద్ధాత్రీతలంబెల్ల హృ
ద్విన్యాసంబున నేలఁగంటి మఱికాదే యింపుమైఁ గార్యముల్
సన్యాసత్వముఁ బూని నన్ను మదినిచ్చల్ నమ్మియున్నట్టిచో
నన్యాయం బెట నుద్భవింపదుగదా యాభీలవైరంబులన్. 53

క. ఏపని పనిచినఁ జేసెద, మీపాదములాన తెలియ మెల్లనఁ జెప్పుఁడా
దాపరము సేయనేటికిఁ, దాపసవరులార మీకు దాసునియెడలన్. 54

క. నావిని మునివరులెల్లన్, భావంబున సంతసిల్లి బహువైఖరులన్
దీవించి రాఘవేంద్రుని, తో వినుమని యిట్టులనిరి తోడిఁబడుకరుణన్. 55

ఉ. శ్రీరఘురామ శత్రుముఖజీవనజస్ఫుటసోమ భూరిర
క్షోరణభీమ చారుతనుసుందర నిర్జితకామ విస్ఫుర
త్సూరసహస్రధామ భవదుఃఖవిరామ పవిత్రనామ వి
స్తారయశోభిరామ శుభధామ రఘూద్వహహృష్టహోద్భవా. 56

గీ. అలిగి రావణకుంభకర్ణాదిఘోర, రాక్షసావలినెల్లను రణములోన

---

1 గనుచు వేడ్క. 2 ముఖ్యముల్.

బాణములపాలుచేసి మాబాధమాన్పి, తింతకంఠెను శుభము మాకేదిచెపుము. 57

చ. శతభుజదండనిర్జితకృతాంతనిలింపవరేణ్యు యక్షరా
డతులితసిద్ధసాధ్యగరుడాహిసమస్తచరాచరుల్ మహో
ద్ధతభువనైకకంటకుని దానవనాయకుఁ బుత్తికంఠునిన్
క్షితిఁబడనేయ నెవ్వరికిఁజెల్లుఁ దలంపఁగ రాఘువేశ్వరా. 58

శా. నిద్రాసక్తి యొకింతమానిన భోమల్ నిక్కించి చేచాచి య
క్షుద్రాకాశధరాపరీతములు దా శోధించి యేమబ్బినన్
రౌద్రాకారతవక్త్రగహ్వరముఁ జేరందెచ్చి భక్షించుకో
పోద్రేకాత్ముని గుంభకర్ణు నురుదేహుం గూల్పఁగా శక్యమే. 59

శా. జంభారాతిని నూఱుమాఱు లనిలో సాధించి లంకాపురిన్
శుంభద్విక్రముఁడై తదీయసతులన్ ద్రుక్కుం జెఱల్ వెట్టి దో
స్తంభానర్గళుఁడై [1]మహోగ్రరణకాంక్షన్ సంచరించుం దదు
ద్దంభప్రోద్ధతుఁ డింద్రజిత్తు ఘనయుద్ధక్రీడకున్ సాధ్యుఁడే. 60

ఉ. దోయిటఁ బట్టనేర్చు నలతోయధులన్నియు నొక్కపెట్టునన్
[2]వాయువు నిల్పనేర్చు శిఖివాతనుబద్ధను వెళ్లనేర్చు మా
యాయుతవిక్రముం డతని [3]నన్యనృపాళికి శక్యమే మృతుం
జేయఁగ మేటిరక్కసి వజీరుని నయ్యతికాయు నుర్వరన్. 61

గీ. [4]పిన్నయప్పుడె యముఁబట్టి పీచమణఁచె, నెదయెఱఁగి వేలుపులనెల్ల నేపుమాపెఁ
[5]ద్రిభువనాజేయు నసిచాల ధిక్కరించె, నమ్మహాకాయు నెదిరింప నలవియగునె.

గీ. వినకయుండురె మీరును వెసమహేంద్ర, నొక్కవ్రేల్మిడి నెగమీటుచుక్కగఁరి
యప్రతిద్వంద్వసాహసు లైనయట్టి, కంపనాకంపనులతోడఁ గడఁగఁదరమె. 63

ఉ. అంత మొనర్పనేర్తురు కృతాంతునినైనఁ గడంగిరేని మె
ప్పింతురు రావణాసురుని భీమగదారణకౌశలంబులన్
ంతగ వారిఁగన్న నలవిశ్వపు డైనను ఖీవినొందు దే
ంతకు నన్నరాంతకుని సాహవమం దెదిరింపవచ్చునే. 64

---

1 మహారణముకాంక్షన్ సల్పుచో గెల్వఁగా. 2 వాయువుఁబట్టికట్టు శిఖివాత బద్ధైనను. 3 నన్యనృపావళి యోర్వలేదు. 4 తలఁచినప్పుడె యముఁబట్టి తఱిమికొట్టు. 5 త్రిభువనంబెల్ల సాధించి.

వ. మఱియును నదియునుం గాక దేవదానవసంగ్రామరంగనిరోధుం డగుమహోదరుం
డును, సకలదిగంత దంతావళ దంతాగ్రసంఘాతక్షతనిమ్నోన్నత వక్షస్థలప్రశస్తుం
డగు ప్రహస్తుండును, క్రోధావలోకనమాత్రచంచలాయమానవిశ్వుం డగు మహా
పార్శ్వుండును, నిఖిలశత్రుభీముండగు ఖడ్గరోముండును, ప్రళయసమయ కనదనల
సదృశధాముండగు సర్పరోముండును, హాలహాలప్రతిమాన విషరోమస్తోముండగు
వృశ్చికరోముండును, శమనసమవిక్రమక్రమవిమతోదగ్రమహోగ్రాహిసుపర్ణుం
డగు నగ్నివర్ణుండును మొదలుగాఁగల దానవు లపారబలపరాక్రమవంతులు గారె
వారినెల్ల నల్లన సంహరింపవే? అదియునుం గాక దుష్టనిగ్రహశిష్టపరిపాలకుండును,
జగదేకవిక్రముండు నను బిరుదులు నీకుఁ జెల్లునని వెండియు నమ్మునీంద్రులు [1]రామ
చంద్రున కిట్లనిరి. 65

గీ. అనఘ నీశౌర్యమునఁ జేసి యఖిలజనులు, పరిణమించియు నిప్పటిబాధవలనఁ
బరిణమింపకయున్నారు పార్థివేంద్ర, యెట్లు చెప్పుదు మవ్వార్త లేము కడఁగి. 66

గీ. శతముఖుండను ఘోరరాక్షసవరేణ్యుఁ, డప్రతిద్వంద్వదోర్బలుఁడై సరోజ
గర్భువరములఁ జేసి లోకములు గలఁచెఁ, గావరుండు ప్రతాపలంకావరుండు. 67

క. మును దశకంఠునిబాధకె, మనఁజాలక యొక్కభంగి మంటిమి యిపుడో
జనవల్లభ శతకంఠుం, డొనరించెడి ఘోరబాధ కోర్వంగలమే. 68

గీ. వారె దివిజులు దేవతావర్గమెల్ల, నస్థిరాత్ముఁడు గావించునాపదలకు
వరుస నిల్చినవారు నీశరణు చొరఁగ, ననుడు రాముండు వీక్షించె నభ్రతలము. 69

వ. ఇట్లు వీక్షించిన దేవతలును బొడచూపి పారిజాతప్రసూనంబు లానృపసూనునిపైఁ
గురియించి యంతర్ధానంబు నొందిరి; రామచంద్రుండును విషణ్ణహృదయుండై చింతించి
పదితలలరక్కసు నుక్కణంగింపనోపక సీతావియోగుండనై యక్కారణంబున
వాలింద్రుంచి క్రోఁతులమఱవ్రచొచ్చి, యనేకప్రయాసంబుల వైరంబు చక్కం
బెట్టి లోకంబు లుద్ధరించితి నది యట్లుండె; నూఱుతలలును, గరశతద్వయంబునుం
గల శతకంఠు నెట్లుసంహరింప నేర్తునని యుల్లంబున మెల్లన వగచి వెండియు
నమ్మునీంద్రులతో నిట్లనియె. 70

క. ఎవ్వనికిఁ బుట్టె నాబలుఁ, డెవ్వారికోఱి కింతసేసె నిట్టిదురాత్ముం
డెవ్విధిఁ గోరె వరంబులు, మవ్వంబున బద్మభవుఁడు మఱి యెట్లొసఁగెన్. 71

క. ఎఱిఁగింపుఁ డిపుడు సత్మని, పరుఁగార భయంబునొంది వనరఁగ నేలా

[1] రాజేంద్రున.

దురితాత్ముని మీపంపునఁ, దెఱవొప్పఁగ సంహరింతు దివిజులు పొగడన్. 72

క. అనవిని మునివరులెల్లన్, మనముల హర్షించి మృదులమధురతరోక్తుల్
వెనఁగొనఁగ రామభద్రునిఁ, గనుఁగొని యిట్లనిరి భయవికారముదోఁపన్. 73

క. విశ్రాంతి దనరు సుగృహ, స్థాశ్రమముని యగుపులస్త్యుఁ డనుసుకృతునకున్
విశ్రవసుం డనువాఁడును, నశ్రముఁ డనువాఁడు నిరువు రట్లుదయింపన్. 74

వ. అందు విశ్రవసుం డనువాఁడు కైకేశి యనుదానిం బాణిగ్రహణంబుగావించి దాని వలనం గ్రమంబున రావణకుంభకర్ణాదు లగుజగదేకప్రతాపులఁ గాంచె; అశ్రముం డును చిత్రగంధి యనుగంధర్వవధూటిం దగులుకొని సంతానంబు గానక కతిపయ దినంబులు చింతించి, దశకంధర ఘటకర్ణ విభీషణప్రముఖులగు విశ్రవసునికొడుకులు సమగ్రప్రచండులని లజ్జించి తనమనంబున నిట్లనియె. 75

చ. తనయులు లేనిధామమును దైవనివాసములేనిగ్రామమున్
వినయము లేనివిద్యయు వివేకము మాలినయట్టివైద్యమున్
జనపతి లేనిరాజ్యమును సౌఖ్యవిరోధక మైనభోజ్యముం
గనకము లేనిభాగ్యమును గన్గొన నిన్నియుం వ్యర్థకార్యముల్. 76

ఉ. కావునఁ బూని యేను దశకంఠునికంటెఁ బ్రతాపశాలిగా
వావిరి నాత్మఁగోరి యొకవంకతపం బొనరించి యందుచే
నావల నూఱుమోములను హస్తశతద్వయముం గలట్టి స
ద్భావుని ఘోరశాత్రవ[1]విఘాలునిఁ బుత్రునిఁ గందు వేడుకన్. 77

*చ. అనిచని యశ్రముం డొకవనాంతరమందున మూఁడుమూర్తులన్
మనముననిల్పి చండరవిమధ్యమునం దనచూడ్కినిల్పి యి
మ్మునఁ దపమాచరింపఁగ త్రిమూర్తులు దా నెగుటం జెలంగి యా
యినుఁడు ప్రసన్నుఁడై తనయునిచ్చె జగద్భయదప్రతాపునిన్. 78

---

1 విదారుని.

*వ. అని యశ్రముం డొకనాఁడు వనాంతరంబున కేగి యశ్వత్థతరుమూలంబున వేదిక నియమించి యందుఁ గుశాసనం బుంచి యందుపై బిల్వపత్రంబులు పఱచి తిలాక్షతోదకంబులు చల్లి భూశుద్ధిగావించి యందు గూర్చుండి భూతశుద్ధింజేసి యంతర్మాతృకల బహిర్మాతృకలుగాఁ జేసి యమనియమప్రత్యాహారధ్యానధారణసమాధ్యష్టాంగయోగంబుఁ బూని భ్రూమధ్యంబునఁ బున్నమచంద్రుని దనచూడ్కినినిల్పి నిరీక్షణంబులు నంతర్లక్ష్యంబులుగాఁ జేసి త్రిమూర్త్యాత్మకుండైనభానుం దలంచి తపం

వ. ఇట్లు భండనోద్దండశతద్వయభుజాదండుం డగుపుత్త్రునిం బడసి మఱియును లంకకం
టె సహస్రగుణాతిశయం బగుప్రతాపలంక యనునొక్కపట్టణంబు సముద్రమధ్యం
బున విశ్వకర్మచే నిర్మింపఁజేసి యందు శతకంఠునికిం బట్టంబుగట్టి వెండియుఁ దపం
బున కరిగె నంత. 79

క. మీరును రావణముఖ్య, క్రూరాసురవరులఁ జంపి కువలయ మెల్లన్
గౌరవమున రక్షించితి, రారూఢిగ వేల్పులును నహోయనిపొగడన్. 80

గీ. శతముఖుండును రావణక్షయముఁ గుంభ, కర్ణమరణంబు నింద్రజిత్కాయభగ్న
మంతయును విన్చ విలయకాలాగ్నిపగిది, మండి దండిగ నూహించె మనసులోన.81

గీ. నరులు వానరులన నెంత నాకుఁ దృణము, జగతిఁ దక్కినవారిచేఁ జావకుండ
నిమ్ము వరమని యలభారతీశుఁగోరెఁ, గాని రావణుఁ డేమ్యంబు గానఁడయ్యె. 82

వ. కావునఁ బరపురుషులచే నెవ్వరివలనం జావులేకుండ విరించిని వరంబుగోరి యట
మీఁద రామునిసంహరించి తనయగ్రజులపగ యీఁగెదనని ప్రతాపలంకాపురి
పాలనంబునకు నాప్తులగుమంత్రులం బ్రతిష్ఠించి, మాణిక్యకనకరజతతామ్రలోహాది
నవప్రాకారరక్షకు లగురాక్షసుల నాదరించి, యొకమహారణ్యంబునకుం జని యందు
కృతస్నానుండై భారతీరమణునుద్దేశించి, జగదద్భుతంబుగాఁ బంచాగ్నిమధ్యంబున
నచ్చోట [1]బొటమనవ్రేలుఁ దగోని నిక్కి హస్తంబులెత్తి మహోష్ణచండమధ్యాహ్న
మార్తాండమండలంబుఁ జూచుచు నిరాహారుండై వెయ్యేండ్లు తపంబుగావించె నంత.

చ. జగములు తల్లడిల్ల రవిచంద్రులు గన్నులు గ్రిక్కి నిల్లుగా
దిగిభములెల్ల మ్రొగ్గె జలధివ్రజ మింకె సమస్తజీవముల్
వగచె సురేంద్రుఁడున్ బెదరె నార్యుఁ డిటాగ హిరణ్యగర్భుఁడున్
మొగి నరుదెంచి నిల్చె నతిమోహమెతో శతకంఠుముందటన్. 84

బఱువదివేలేండ్లు గావించిన భానుండు ప్రసన్నుండై జగద్భయదప్రతాపశాలియగు
నొక్కపుత్త్రుని దయచేసి యినుం డంతర్ధానుండయ్యె నంత భండనోద్దండశతద్వ
యభుజార్గళుం డగుతనయునిఁ బడసి మఱియుఁ లంకకంటె సహస్రగుణాతిశయం
బగుప్రతాపలంకాపట్టణంబును సురసముద్రంబున విశ్వకర్మచే నిర్మితంబుచేసియందుఁ
దొమ్మిదికోట్ల వీథులును బదునెనిమిదికోట్ల శివాలయంబులును సహస్రయోజనవిస్తీర్ణం
బును దశసహస్రయోజనోన్నతంబును గలపట్టణంబున శతకంఠుని బట్టంబుగట్టి వెం
డియుఁ దపంబున కరిగె నంత.

1 మొనవ్రేలు.

వ. ఇవ్విధంబున నవ్విరించి సుప్రసన్నుండై కరుణారసంబు వెల్లుబ్బ నబ్బురంబుగా నిట్లనియె. 85

శా. అస్మా ద్యోగియశస్య యశ్రమతనూజా యుష్మదుద్యత్తపో
త్సాన్నత్యంబున కిచ్చ మెచ్చితి వరం బూహింపుమా యిచ్చెదం
గన్నే ల్లిప్పము నన్నుఁ జూడు మనుచుం గారుణ్యపాథోధియై
చెన్నారం దను నాదరింపఁ బరమేష్ఠిం జూచి హర్షాత్ముఁడై. 86

మ. కరముల్ మోడ్చి విరించికిన్ శతనమస్కారంబు [1]లందంద యొం
త్కారతా భక్తి నొనర్చి లేచి తనవక్త్రంబుల్ విడంబించి యో
హరినాభీకమలోద్భవా నిగమవిన్యాసప్రశస్తాననా
కరుణాసాగర నీకు మ్రొక్కెదను మత్కామ్యంబు లీడేర్పవే. 87

వ. అనిమఱియును బహువిధంబులఁ గైవారంబుఁ జేసిన విని వనజసంభవుండు పరమప్రీతుండై యొక్కవరంబు వేఁడు మొసంగెద ననుడు శతముఖుండును సంతసిల్లి, అయ్యా నెయ్యంబున వరంబులు గరంబు నొసంగుతలంపు మీకుండె నేని యక్షరాక్షస గరుడగంధర్వసిద్ధవిద్యాధర కిన్నరకింపురుషసురనరవానరాదు లగుపురుషులవలనను, మృగాండజ భుజంగమలోకంబులవలనను, మీనకర్కట మకరకచ్ఛపాది జలచర సముదయంబువలనను మరణంబు లేకుండనిమ్మనిన నప్పరమేష్ఠియుఁ దప్పక దయ చేసి మఱియు నొక్కవరంబు వేఁడుమనిన దనుజేంద్రుండును హర్షించి, రణంబు సేయునెడఁ దనశరీరంబునం గలశోణితకణం బెచటం దొఱంగు నచట నూర్గురు శతముఖులు జనించునట్లుగా [2]ననుగ్రహింపుమనుడు జలజాసనుండును నత్తెఱంగునకు సమ్మతించి, నీతపోమహిమంబునకు మూఁడులోకంబులందు సరిరాఁజుంగము గావున నింకొక్క వరం బడుగుమని సుప్రసన్నుండైనం గని జరయును, శ్రమయును, పరితాపంబును, భయంబును, దైన్యంబును నెన్నండును దన్నుం బొందకుండ వరంబొసంగు మనవుడు విరించి యట్లగుంగాకయని దీవించి యంతర్ధానంబు నొందె శతముఖుండును ప్రతాపలంకాభిముఖుండై చనునెడ. 88

క. మెండుకొన భయము ధరణీ, మండలమున దల్లడిల్లె నూఁగుచు నిశలన్
సందుకొనె నిర్జరేంద్రుఁడు, గుండియ జల్లనఁగఁ జేతి కుశము పైచెన్. 89

వ. శతముఖుండును గమలసంభవవరాసంప్రాప్త ప్రభావ ధురంధరుండై తనపురంబు ప్రవేశించి, తనజ్ఞాతులగు రావణ కుంభకర్ణుల పగయొఁగి రామునిం దునిమెద

1 లందంద నిద్దరపై. 2 ప్రసాదింపు.

నతం డగుపడుదనుకను దత్ప్రియంబులగు గోబ్రాహ్మణముని దేవతాసంఘంబుల హాననంబు గావించెదనని ప్రధానులును, దండనాయకులును దన్నుఁ గొలువ సకలదిక్కులును ప్రక్కలుగావించి, దేవతలపురంబునకు దాడివెట్టి, దివిజులం బాఱఁదోలి మఱలి మాయాశ్రమంబులు చూఱలాడి, కొందఱు మునులంజంపి, పతివ్రత లగుతరుణులఁ జెఱలుగొని, హోమధేనువులం దునిమి, యివి మొదలుగాఁగల యనేకహింసలు గావింపఁదొడంగె నని వెండియు రామచంద్రున కిట్లనిరి. 90

ఆ. ఈవు దప్ప మాకు నెవ్వారు దిక్కులే, రట్లుగాన ఖ్యాతి నమరవరులు
వెలయ మిమ్ముఁజేరి వేఁడుకొండని పంప, వచ్చినార మభయమిచ్చి ప్రోవు. 91

ఆ. అనుచు బాష్పధార లక్షుల దొరలఁగా, నతిభయార్తు లగుచు నమ్మునీంద్రు
లున్నవారి నుడువ నూహించి రామభూ, వరుఁడు పలికె మధురవాక్యములను. 92

ఆ. తెగువ సింత సేయు దేవతాద్రోహిని, సంహరించి మిమ్ము సకలసురలఁ
గాతుఁ గరుణమీఱఁ గావఁగాలేకున్నఁ, బ్రాణమేల [1]యీకృపాణమేల. 93

ఆ. అనుచు వారి కభయహస్తంబు లిడి పంచె, నఘవిదూరుఁ డైనరఘువరుండు
చనిరి మునివరులును సంతోషభరితులై, మగిడి తత్తదాశ్రమంబులకును. 94

గీ. చనినఁ బిమ్మట నేకాంతసౌధమందు, రాఘవుఁడు భూసుతరశరలాఘవుండు
మహిమతోడుతసౌమిత్రిమైత్రి మెఱయఁ, జేరికొలువంగఁ గూర్చుండి చిత్తమునను.

క. శతముఖుని [2]జన్మమహిమము, జలనంబుగ నతఁడు తపముసలిపినవై
స్థితియును వరములు గొనుటయు, మతిఁగోఁ దలపోసి దీనమానసుఁ డయ్యెన్. 96

క. తా నసురాంతకుఁ డయ్యును, మానవుఁడై యుంటఁ జేసి మహిమలు తెలియం
గానోపక పలుమాఱును, వానిపరాక్రమముఁ దలఁచి వనరఁగఁదొడఁగెన్. 97

వ. ఇట్లు తలంకుచుఁ దదనంతరంబ సుమంత్రాదిమంత్రుల నటకు రావించి, వారు వినంగ లక్ష్మణుమొగంబై యిట్లనియె. 98

సీ. కెరలెడి దధిఘృతక్షీరసురాసముద్రంబు లేపథమున దాఁటవచ్చు
దాఁటెఁబో వాని విధాత్రుఁడిచ్చినవరగర్వ మెత్తెఱఁగునఁ గడవవచ్చు
గడచెఁబో నవపరిఖాయుతప్రాకారపట్టణం బెటు లగ్గపట్టవచ్చుఁ
బట్టెఁబో కలనిలోఁ బరపురుషాభేద్యదనుజవల్లభు నెట్లు దునుమవచ్చు
గీ. నేలవచ్చిరి సకలమునీంద్రు లిటకు, నేల ప్రతినలు గావించి తేచు దనుజ
వంశవిభుఁ డెట్టికైవడి వసుధఁ గూలు, నకట తమకించి పలుకుట హానిగాదె. 99

1 యింక బాణమేల. 2 సంభవంబును.

వ. అని తానును లక్ష్మణుండునుం దక్కఁ దక్కినబలసామగ్రి చాలకుండుటకును, చతుస్సముద్రలంఘనంబు గావింపఁజాలకుండుటకును నిర్విణ్ణహృదయుండై యూరకుండె మంత్రులు నిట్టిట్టని యూహింపనేరరైరి తత్ప్రకారం బీక్షించి కోపారుణితలోచనుండై సౌమిత్రి రామచంద్రున కిట్లనియె. 100

గీ. శతముఖునియంత రాక్షసచక్రవర్తి, నెట్లు సాధింతునని విచారింపనేల
తూలికాపర్వతంబును ధూళిచేయ, మిణుఁగు ఱింతైనఁ జాలదే మేదినీశ. 101

వ. అట్లుగా విచారింపు మదియునుంగాక. 102

చ. పడిఁ గబళింతునే శశిదివా[1]కరబింబములం గణంకమైఁ
బుడిసిటిలోన నిల్పుదునె భూరిపయోనిధులెల్లఁ బెల్లుగాఁ
బిడుగునుబోలుముష్టిహతిఁ బృథ్వియుఁ నింగియుఁ ధూళిచేతునే
యెడపక నాదుముందఱ సహించి శతాస్యునిఁ జెప్ప నేటికిన్. 103

శా. చిత్రం బొప్పఁ దపంబుచేసి శివు [2]నక్షీణత్రిశూలం బొగిన్
సుత్రామాదులు మెచ్చఁ గైకొని నృపక్షోభప్రశస్తున్ బుధా
మిత్రాత్మున్ లవణాసురుం దునుమఁడే మీరెల్ల హర్షింప నా
శత్రుఘ్నుం డణుమాత్రుఁడే తలఁపఁగా సంగ్రామరంగంబునన్. 104

చ. నిరుపమవిక్రమస్థితిని నీసరివచ్చు నపారఘోరసం
గర మగువేళ దుర్విమతఖండనమంత్ర మెఱుంగుఁ గ్రమ్మఱం
బగబల మెత్తివచ్చిన శుభం బొనఁగూర్చుకొనంగ నేర్చు నా
భరతుఁడు కేవలుండె యురుభండనభూమిని రాఘవేశ్వరా. 105

శా. దండిన్ మున్ను మహాధ్వరాశ్వమునకై దర్పించి మ మ్మందఱిన్
గుండెల్ వ్రీలఁగ నేయరే దివిజు లాఘోషింప యుద్ధంబునన్
వెండి న్మిమ్ములనుం జెనంకి మనరే వేగంబునన్ భండనో
ద్దండుం డాకుశుఁడున్ లవుండు ధర నేశస్త్రాత్రులే భూవరా. 106

చ. రసికుఁడు విద్యలందుఁ బరరాజభయంకరుఁ డెంచి చూడఁగా
నసిముఖతీక్ష్ణాస్త్రవివిధాశుగసంచితశౌర్యశాలి దై
[3]త్యశమనమూర్తి శుంభదఘుదారుణగోత్రపవిత్రధారి మా
కుశునికుమారుఁ డుగ్రరణకోవిదుఁ డావిజయుండు దేలయే. 107

1 కరులం బటుక్షేమశక్తిచే. 2 మెచ్చించి. 3 విశదయశోవివర్ధనుఁడు వీర
పరాక్రమచక్రవర్తి మీ, కుశుఁడు కొమారుఁడండ మఱికుండఁ బనేమి నృపాలశేఖరా.

మ. అదియట్లుండఁగనిమ్ము వేల్పులు రణోద్యత్ప్రాభవుల్ దన్నుఁ డె
బ్బదిరెండ్వేల్వలుగొల్వ రౌద్రముఖుఁడై భానుప్రభల్ మీఱఁగా
నదనం దన్ను నెదిర్చినన్ భయదవాలాభీలుఁడై మృత్యువున్
గెదుమంగాఁ గలబాహువిక్రముఁడు సుగ్రీవుండు సామాన్యుఁడే. 108

శా. ఓష్ఠద్వంద్వము వెల్లుగా నదర రాహుంబోలె మందోదరిన్
నిష్ఠూరంబుగఁ బట్టితెచ్చుచుఁ గపుల్ నిక్కన్ దశాస్యోగ్రహా
న్నిష్ఠాభంగముఁ జేసి పెంపుగనఁడే నీకుందటన్ వానర
శ్రేష్ఠుం డంగదుఁ డంతవాఁడు గలుగం జింతింపఁగా నేటికిన్. 109

శా. తల్లిం దండ్రివి నీవె యంచును మదిం దాత్పర్య మొప్పంగ మీ
కెల్లం దానె విచారము ద్దెలుపు చెంతే దానవాధీశవ్యా
ద్భల్లంబై చరియించుభండనమునం బ్రత్యర్థిసంహారుఁ డా
భల్లూకేంద్రుఁడు జాంబవంతుఁడు తలంపం [1]గొంచెమే యెంచఁగన్. 110

శా. కేల న్సాలమహీజయుగ్మము రణాంగీకార మొప్ప న్మహా
భీలుండై ధరియించి యెల్లదిశలు న్భేదిల్లఁగా నార్చుచున్
వాలం బభ్రము సోకఁ జాఁచి రిపుల న్వారించుధీరాత్ముఁ డా
నీలున్ శౌర్యగుణాలవాలు నెదుర న్నెట్టించువారే రిలన్. 111

ఉ. కార్ముకమందెనేని పటుకాండపరంపరచే నరాతులన్
మర్మము లుచ్చిపోవ నసమానచమత్కృతిసేయ నేర్చు దు
ష్కర్ములఁ గూడఁ డెన్నఁ బురుశౌర్యసుస్థైర్యుఁడు కార్యవేది జ్యో
తిర్ముఖునంతవాఁడు మనదిక్కునఁ గల్గఁగ జింతయేటికిన్. 112

చ. క్షితిధరవృక్షవర్గ మఱచేతుల నిచ్చి కడంగిరేని యా
శితిగళుఁడైన భీతిలు నశేషపరాక్రము లాహవంబునన్
దితిసుతలోకశుష్కవనతీవ్రదవానలకీల లుగ్ర లా
శతబలియు న్గవాక్షుఁడును జాలరె దైత్యుని సంహరింపఁగన్. 113

వ. మఱియు నదియునుంగాక వానరయూథాధిపుం డగు తారకుండును, మహాభుజుం డగు గజుండును, వజ్రధారాప్రతిమానకరభుం డగుశరభుండును, సమరజయోపమానస్తే ములగు గోముఖ, గంధమాదన, ఋషభ, మైంద, ద్వివిద, వేగదర్శి, గవయప్రముఖ నిఖిలమహావనచరచమూ[2]నాయకులును గడంగిరేని చతుర్దశభువనంబులుం బరి

1 గొంచుడే. 2 సముదయంబులు గడంగిరేని.

మార్పనోపరే అదియునుంగాక మీరు పెట్టినచెట్టు విభీషణుం డిట్టిసమయంబున దోడురాకుండునే అతం డలిగిన సకలబ్రహ్మాండంబులుం [1]జూఱలాడఁడే ఇంత బలసామగ్రిగలుగ నసురవరునిఁజౌఱకు నీవింత వంత నొందఁదగునే యని మహా బలవంతుం డగుహనుమంతునిం దలంచి చిఱునవ్వునవ్వుచు లక్ష్మణుండు వెండియు రామచంద్రున కిట్లనియె. 114

సీ. పుట్టినప్పుడె పట్టి పెట్టినదంబుగ [2]నట్టె మ్రింగఁడే భానుని నింగి కెగసి
ఆసమానజవముచే నలరి కాల్వయుఁబోలె దాఁటఁడే యలసముద్రంబుఁ గడిసి
లంకాపురము సొచ్చి శంక యించుకలేక హతునిఁ గావింపఁడే యక్షుఁ గణఁగి
దీపితాటోపకోపాపారశిఖిశిఖాతతులచేఁ గాల్పఁడే తత్పురంబు
తే. [3]అట్టి జగజెట్టి యగు గాడ్పుపట్టి మనకు, నిట్టివేళలఁ గలుగంగ నేల వగవ
నతఁడు గడఁగిన శతకంఠుఁ డనఁగ నెంత,యొక్కవ్రేల్మిడి నెగమీటు నుర్వియెల్ల.

*వ. మఱచితిరే నాఁడు మనల నిరుపురం గొనిపోయి మహిరావణుండు పాతాళంబున భద్రకాళికిఁ బ్రియంబుగా నిచ్చి త్రుంపం బూనుసమయంబున నొకశతపత్రనాళంబున సూక్ష్మరూపంబునం జొచ్చి అచ్చటఁ గాపున్న మత్స్యవల్లభునితోఁ బెనంగి అతిరయంబున నిశాసమయంబున నప్పాతాళలంకానివాసు లగురాక్షసులనందఱ నిర్మూలంబుగావించి పిదప మహిరావణుతోఁ బోరాడి సప్తభ్రమరంబులతోడ వాని ప్రాణంబులుం గొని మనలను బ్రతికించెఁ గాదె అట్టి ప్రాణబంధుండును శౌర్య

1 పరిమార్పనోపఁడే. 2 భాను నొడిసి మ్రింగఁడె మింటికెడకు నేగి. 3 అట్టి బలుదిట్ట. * ఈవచనములో మొదటినుండియు...మనకాప్తుండైయున్నవాఁడు. అను వఱకు నొకప్రతిలో నీసీసపద్యమున్నది.

సీ. మఱచితిరేనాఁడు మైరావణుఁడు గొంచుఁబోయి పాతాళంబు పొసఁగ మనల
భద్రకాళికిఁ బ్రియంపడఁజెల్ల భేదించుసమయంబునందున సారసంపు
నాళంబునను సూక్ష్మనాళుఁడై తగవచ్చి యచ్చట గాపున్న మత్స్యపతితో
బోరాడి పాతాళనీరాటఫలఁ గొట్టి మైరావణుని రూపుమాపి మనల
గీ. బ్రదుకఁ జేయఁడె మనప్రాణబంధుఁ డగుచు
నితఁడు సామాన్యుఁడే చూడ నిశ్చయము మాకు
గలుగ సంగరవిజయంబు గలదు వగవ
రాదు సుస్థిరగుణసాంద్ర రామచంద్ర.

వ. అదియునుంగాక.

ధురంధరుండునగు మరున్నందనుండు మనకాప్తుండై యున్నవాఁ డదియునుంగాక సకలదేశంబులవారును సుఖదుఃఖములకు మనలోవారుగాని వెలిగాఁ బ్రవర్తింప నేర రింతయును విచారించి సంగరంబున కరిగి శతముఖుని సంహరించి లోకంబులఁ గావుమని వెండియు నిట్లనియె. 116

గీ. దంబుగలభద్రదంతావళంబువోలె, నిన్ను నీ వెఱుఁగవుగాక నీపురణము
నందు నలిగితివేని బ్రహ్మాండమెల్ల, నిలిచి భస్మీకరింపవే నిమిషమునను. 117

గీ. అనుచుఁ దమ్ముఁడు బోధింప నలరి రామ,భద్రుఁ డెంతయుం సత్యంబు పరులగెలువ
వచ్చు నీచెప్పినట్టి భావముల ననుచు, జనవరేణ్యుండు పిదప లక్ష్మణున కనియె.

గీ. కార్యఖడ్గములననందు గలవురెండు, గార్యముత్తమ మది చక్కఁగాకయున్నఁ
బలువిధంబుల నవ్వలిబల మెఱింగి, ఖడ్గ మొనరింప నటమీఁది కర్జమండ్రు. 119

వ. అది గావున మొదట సామదానమాయోపాయ భేదంబుల శతకంఠుం బరిమార్ప నూహించెద. అట్లొనఁగూడకున్న దండంబునదండధరునిలోకంబున కనిచెద. వాఁడ న నెంత? యింతలో విభీషణుని రావించి యతనివలన శతాస్యునివర్తనంబు లన్నియుం దెలిసికొని యటమీఁద నమ్మహాత్ముండు చెప్పిన త్రోవం జనుదమని విభీషణుం దలంచిన నతండును దనమనంబున హర్షించి యొప్పరికి నెఱింగింపక యతిశీఘ్రగమనంబున. 120

చ. అనిలుఁడు నన్నలుండు హరుఁ డానిగఁగర్గినమంత్రులందఱుం
దనుఁగొలువ న్సముద్రము ముదంబున దాఁటి బలంబు నెక్కొనక్
వెనుకొని యభ్రవీథిని నవీనజవంబునవచ్చె వచ్చి స
జ్జనమణియైన రాఘవుని సన్నుతిసేయుచుఁ దత్పురంబునన్. 121

క. రాముఁని గోమలమేను, శ్యాముని మునిలోకపవిత్రసంతతవిలస
న్నాముని శాత్రవభీమునిఁ, బ్రేమను వీక్షించె నవ్విభీషణుఁ డెలమిన్. 122

క. వీక్షించి యతనిచరణము, లక్షీణదయామనస్కుడై తననిటలం
బాక్షితిని సోఁక మ్రొక్కుచు, రాక్షసనాయకుఁడు లేచి [1]ప్రవిమలభక్తిన్. 123

చ. జయజయ మానిహృజ్జలజ[2]చారణ పాపవినాశకారణా
జయజయదైత్యసంహరణనాయక కామ్యఫలప్రదాయకా
జయజయ పుణ్యగాత్ర యతిసత్యచరిత్ర విచిత్రవిక్రమా
జయజయ రామచంద్ర గుణసాంద్ర సురేంద్రమునీంద్రసన్నుతా. 124

1 రసికోత్తముఁడై. 2 షట్పదహారిమునీంద్రపోషకా.

వ. అని యిట్లు పలుతెఱంగుల వినుతింప నమ్మధురమృదులభాషణుండగు విభీషణుఁ గ్రుచ్చి గాఢాలింగనంబు గావించి, ఆనందాశ్రుజలపరంపరలు దొరుఁగఁ సరసఁ దనదండ నొక్కరుచితపీఠంబునం గూర్చుండంబెట్టి భక్తవరాయణుండగు రామభద్రుం డతనిసేమంబు దెలిసి మన్నించి మెల్లన నిట్లనియె. 125

శా. ఆవేళం బవరంబునం దలదశాస్యాఖీలబాణాగ్నిదా
నావిర్భూతమునొంద స్రుక్కి మఱి చేయాడింపఁగాలేనిచో
నీవేచేయిగ మర్మకర్మతతుల స్నేర్పంగ హింసించితిఁ
నీవం టాప్తుఁడు భూమిలోనఁ గలఁడే నిక్కంబు దైత్యోత్తమా. 126

గీ. ఓవిభీషణ నీవంటివావఁజేసి సంగరాం[1]బుధి నరసి యీఁదంగఁ గంటి
నట్టిపలనను గడచితి, నంతకంటె, నొక్కప్రశయంబువార్త నేఁ దుద్భవించె. 127

గీ. ఆట్టి వృత్తాంత మెఱిఁగింతుననఘ వినుము
నూఱుతలలును నిన్నూఱు ఘోరబాహు
లుండు దైత్యేంద్రుఁడొక్కఁడుద్దండుఁ డగుచుఁ
దాపసుల దేవతలఁ గ్రొవ్వి యేపుమాపె. 128

వ. మఱియు ననేకవిధంబుల గోబ్రాహ్మణదేవతావహననంబును సకల దిశారమణతాడనంబును, అఖిలజీవసంక్షోభంబును గావింప నద్దురాత్ముండు చేయుబాధలకుం జాలక మునిదేవతాప్రివహ్నంబు లరుదెంచి, తమతమబాధలతెఱం గంతయు నెఱింగించి శరణుచొచ్చినం గరుణించి, యభయహస్తంబు లిచ్చి పంచితి; ఇటఁమీఁద నేది యుంచ దెలియక యాదానవుని వర్తనంబులన్ని నీచే నెఱుంగుటకు నిన్ను రావించితి ననిన విని విభీషణుండు సజ్జనవరేణ్యుని కరుణావలోకనమహిమంబునకు నిచ్చ నచ్చెరుపడి మచ్చిక నిట్లనియె. 129

సీ. జంభారిగంభీరదంభోళిధారతోఁ బర్వతం బొకటితీర్పంగఁ గలదె
కఠినఖాభీలకంఠీరవంబుతో భద్రేభ మొకటి దీర్పంగఁ గలదె
సంవర్తసమయప్రచండానలముతోడ నెఱిశుష్కగహనంబు నిలువగలదె
ఝంఝావాహ్యాయుప్రభంజనమహాధాటితోఁ గొలఁదిగా మబ్బుమార్కొనగలదె

తే. ఎంతవాఁడైన వరముల నెన్నిగొనినఁ, గనలి నీతోడ నెదిరించి మనఁగఁ గలఁడె
పుడమిఁ బటుమార్గమై తానె పోనుగాక, రఘుకులాంభోధిచంద్ర శ్రీరామచంద్ర.

క. పగవారని మీయెదుటను, బొగడగరాదైనఁగాని భూమీశ్వర న

1 బోధి నే నీదిజయముగంటి. 2 రామణీయకగుణసాంద్ర రాఘవేంద్ర.

నొ్నగినడిగినందునకు దైత్యగణాధిపు మర్మమెల్లఁ దగ నెఱిఁగింతున్. 131

క. పంకజగర్భుండైనను, శంకామతినుండుఁ [1]బొగడఁజాలక నేను
ట్టంకింపఁ గలనె సకలా, లంకారమహత్ప్రతాపలంక మహీశా. 132

క. ప్రాకారంబులు తొమ్మిది, భీకరమైయుండు జంభభి న్మఖ్యసురా
నీకంబులకును దక్కన, లోపల నీకుఁ జెప్ప నేల లోకాధీశా. 133

వ. మఱియుఁ బ్రతాపలంకామార్గంబు విన్నవింతు నవధరింపుఁ డని యవ్విభీషణుఁడు చెప్పందొడంగెఁ బరిఖాజలప్రమాణంబురసాతలంబునతిక్రమించి, బ్రహ్మరుద్రాదులకు నభేద్యంబై ప్రవర్తిల్లు; దీర్ఘజిహ్వ, శిఖిముఖ, స్థూలకంఠ, యోజనహస్త, దుర్ముఖ, శూర్పకర్ణ, రక్తాక్ష, పింగళాక్ష, గజోదర, ప్రముఖులను మంత్రులు పదునెన మండ్రు వర్తింతురు; అందు నొక్కొక్కమంత్రిని నేనూఱుకోట్లరాక్షసులు సేవింతురు; అందు నొక్కొక్కమంత్రి మృత్యువునైనఁ బోరిగొనఁజాలు; అందఱుం గూడినఁ జతుర్దశభువనంబులనుం జప్పరింతురు; వారికి నాథుండు శతముఖుండు. పరమేష్ఠిచే సకలపురుషాభేద్యత్వము మొదలుగాఁగలుగు ననేకదుర్లభవరంబులు గొని విష్ణుశంకరాదులఁ దృణీకరించుచు నతండు మనంబున నేను మిమ్ము సేవించి మీచేత రావణాదులం దునిమించితి నని నన్నుం జంపఁ దలంచుచుండు; నాకు నతనికి వైరం బెప్పుడును గలదు; వాఁడు మీచేతనే కాని మఱియెవ్వరికి నజేయుం డనియెను. 134

గీ. శతముఖునికింకరులు తన్నువాతునిఁ జేయ, [illegible] యనుచు దిశలు
చూచుచుండఁగఁ జాలవీచూపు లనుచు, సమరభర్త సహస్రాక్షుఁ డయ్యెఁగాదె. 135

గీ. ఉరుబలాధిపుఁడగు శతాస్యుఁడు మదించి, దాడి [illegible] దరలి వచ్చు
నొక్కొ యని భీతిమై నేను నుక్కుదక్కి, తారకాచలగహ్వరాంతమున నుందు.

వ. అనిన విని పార్వతీదేవి మహాశ్చర్యంబునొంది చిఱునవ్వు నవ్వుచు శంకరుమొగంబుపైఁ దనచూడ్కి నిల్పి మహాత్మా! యిట్టి విచిత్రంబగుచరిత్రంబు నెన్నండును వినియును గనియును నే నెఱుంగ; నీదివ్యకథావిధానం బేపుణ్యుఁ డాకర్ణింపఁ బూను నతనికి నాయురారోగ్యంబులును మహైశ్వర్యంబును పుత్రపౌత్రలాభంబును సకలబంధునివహానుకూలంబును నై యాచంద్రతారకంబుగా వర్ధిల్లు నటుగాన నేను గృతార్థురాల నైతి నటమీఁది వృత్తాంతం బానతిమ్మనిన నమ్మహాదేవుం డిట్లనియె అట్లు విభీషణుండు శతకంఠుని మహిమంబు కొంత వినిపించి రామచంద్రునకు వెండియు నిట్లనియె. 137

1 బొగడఁజాలం డేనుం బొంకింపగలను.

క. అతులితదోర్బలమునకును, వితతపరాక్రమమునకును వివరింపఁగ నీ
శతముఖునకు రావణునకు, మతిలోఁ దలపోయ హస్తిమశకాంతరముల్. 138

క. కావున శతముఖుఁ దునుమఁగ, నీ వేకాకొండుగలఁడె నృపవర! వేగన్
రావింపుము యుద్ధమునకుఁ, బావనులగుహనుమదాదిబలములనెల్లన్. 139

సీ. నావుడు విని నరనాథుండు చింతించి యేవిధమున దాఁటు దేనువార్ధి
నెవ్వరిబలమున నేగుదాహవమున కేవిధమునఁ ద్రుంతు నేను రిపుల
నేలాగు పోషింతు నెల్లయోగీంద్రుల నెట్లుద్ధరింతు నే నేమిసేతు
దేవతాభయము లేతెఱఁగున వారింతు, వడిసైన్యముల మఱివ్వాఁడు నడుపు

గీ. ననుచుఁ దలపోసి తలసోసి యాత్మయందు
నంతయును జూచి యాహనుమంతునుండి
కొంతకార్యంబు మఱి సమకూరు ననుచుఁ
గోరి ధైర్యంబు మదిఁ బురికొల్పియపుడు. 140

క. హనుమంతునిఁ బటుదోర్బల, ధనవంతుని సకలధరణిదైవతనుత స
ద్ఘనశాంతునిఁ గపికాంతునిఁ, జనుదెమ్మని రాఘవుండు చయ్యనఁ దలచెన్. 141

ఉ. అగ్గతి నానృపాలమణి యాత్మఁ దలంచిన మారుతాత్మజుం
డగ్గలమైన మోదము భయంబును భక్తియునుం బెనంగఁగా
నగ్గురుగంధమాదనమహాచలశృంగముమీఁదినుండి తా
దిగ్గున నేగుదెంచె నతితీవ్రరయంబునఁ దత్క్షణంబునన్. 142

వ. ఇట్లు సంభ్రమంబున మనోవేగుండై వచ్చి సాకేతనగరంబుసొచ్చి యొక్కచక్కని
ముహూర్తంబున. 143

ఉ. [1]శీలుని దివ్యనూత్నమణిచేలునిఁ బావనవిస్ఫుటానల
జ్వాలుని ధర్మసద్గుణవిశాలుని ఖండకళానిధిస్ఫుర
త్ఫాలుని ఘోరశాత్రవవిఫాలుని ధీరుని రామభద్ర భూ
పాలునిఁ గాంచి తచ్చరణపద్మములంబడి లేచి నిల్చుచున్. 144

చ. కరములుమోడ్చి యోదనుజఖండన యోకరుణాసముద్ర యో
పరమవివేక యోకలుషభంజన యోరఘురామచంద్ర మీ

---

1 మేలుగ దివ్యనూత్నమణిమేఖలభూషణ ధారుబావక జ్వాలునిదైత్యఖండనుగ
వాన్నిధివిస్ఫుటతేజపాలుభూపాలుని.

చరణపయోజముల్ భజనసల్పఁగ నేర్పుటయూఁడులోకముల్
తరలక వేడ్క నేలుటగదా తలపోయఁగ మానవేశ్వరా. 145

చ. ధరణిసుతాధిపాయ భుజదండవినిర్జితదానవాయ భా
స్కరకులసంభవాయ జలజాత [1]దళాయతలోచనాయ సం
గరవిజయాయ తాపసనికాయనుతాయ నతాయ తేన మో
పరమకృపాత్మనే వరనృపాయ రఘూత్తమ రాజసోత్తమా. 146

ఉ. ఏపనికైన నన్ను జగదీశ్వర పంపుము సప్తవార్ధులుం
దాపులువన్ని సైన్యములు దాఁటఁగఁ జేతునొ మృత్యువక్త్రము
ల్దావలిచేత మూయుదునొ డాసి కృతాంతునిఁబట్టి తెత్తునో
భూపకులావతంస వెసఁబూని కులాద్రులు పెల్లగింతునో. 147

వ. అని పెక్కుభంగుల సన్నుతింప దశస్యందననందనుండు మరున్నందనుం గరుణామృత లహరులు చెదర నవలోకించి రమ్మురమ్మని యొమ్మొమ్మనఁ గదియ నాలింగనంబు గావించి, కుశలం బడిగి పథిశ్రమంబుదీఱ నొక్కహర్మ్యంబున విడియ నియమించి పనిచిన నతండు చనినపిదప విభీషణుం గనుంగొని యిమ్మహామహునిచేతఁ గాని కార్యంబులొనఁగూడవని యిష్టాలాపంబుల నారేయి గడపి మఱునాఁడు సంధ్యాదిక్రియలు నిర్వర్తించి, గురు పితృపూజనంబులు గావించి అగ్నిహోత్రంబులు దర్శించి విప్రసహస్రంబులకుఁ గర్పూరతాంబూలపరంపర లొసంగి వారిచే నాయురారోగ్యాశీర్వాదంబులు గైకొని భరతశత్రుఘ్నలక్ష్మణవిభీషణాదులతోఁ గూడ నలంకృతుండై సుమంత్రాదిమంత్రులుం గొలువ నేకాంతసౌధంబునం గూర్చుండి అచ్చటికి హనుమంతుని రప్పించి అతండును దానును విభీషణుండును రావణ కుంభకర్ణ దేవాంతక నరాంతక కంపనాకంపనాతికాయ మహాకాయేంద్రజిత్ప్రహస్త మహోదర మహాపార్శ్వ ఖడ్గరోమసర్వరోమ వృశ్చికరోమాగ్నివర్ణప్రముఖ నిఖిలదానవమహోద్దండ ఖండన ప్రకారంబు లుగ్గడించుచు నెడనెడ మారుతిం గొనియాడుచుఁ గొంతప్రొద్దుపుచ్చి హనుమంతునకు శతకంఠుని ప్రకారం బెఱింగింపుమని విభీషణునకుఁ గనుసన్న గావింప నమ్మహాత్ముండును సమ్మదంబున నమ్మరుత్సుతునకుఁ దెలిపెడు శతకంఠుజన్మంబును తపోమహిమంబును జలజభవలబ్ధ వరంబులు గొనినతెఱంగును మునిదేవతాప్రహరణంబులును చతుస్సముద్రలంఘన ప్రయాసంబును పరిఖావిశేషంబును ప్రాకారప్రకారంబును ద్వారరక్షక మహా

1 పలాశవిలోచనాయ.

దానవనివహ విక్రమంబులును మంత్రిప్రచండత్వంబును గరతలామలకంబుగా నెఱింగించిన విని వనచరవర్యుండు గగనంబు ముట్ట గుప్పించి గంతు లిడుచు రామభద్రునిం గొనియాడుచుఁ దనచే నింతయుం సాధ్యం బగుట మనంబున నిశ్చయించి రఘువల్లభున కిట్లనియె. 148

గీ. అన్న రాఘవ నీబంటనున్నవాఁడ, నెంతవాఁడైన వాఁడన నెంత మనకు
మీరు బంపిన నేగి యాక్రూరుఁడైన, శతముఖునిఁ జంపి యేతెంతు జతనముగను.

సీ. అది యెటువలెనన్న నద్రిజాధీశుని శక్తి నాయందున సంఘటిల్లు
నరయజగత్ప్రాణుఁడైన మాతండ్రిచే జవసత్త్వములు నాకుఁ జాలఁగలుగు
[1]నశ్రమశౌర్యంబు నజరత్వ మమృతియుం నమరులవలన నాయందునుండు
నదిగాక మీదివ్యహస్తసంస్పర్శచే మెండుగా వజ్రదేహుండ నైతిఁ

గీ. గాన మీయాజ్ఞఁ దలమోచి కదిసికడఁగి, యనికిఁ దొడఁగిన శతకంఠుఁ డనగనెంత
యట్టహాసంబుచేసి కాలాగ్నినైనఁ, బట్టిమ్రింగుదుఁ జలపట్టి పంతమునను. 150

గీ. దాఁటరాదని జలధులు దడయనేల, మెఱసి దాఁటెంతు వాలంబుమీఁదనేనఁ
దవిలి యాత్మస్తవంబుగాఁ దలఁపవలదు, తథ్య మింతయు నీదుపాదంబు లాన. 151

వ. అని మరుత్సుతుండు వెండియు నిట్లనియె దేవా మీరు నమ్మించిన నమ్మక సుగ్రీవుండు మీచే దుందుభికళేబరంబు మీటించి సప్తతాళంబుల నొకకోలఁ దునియ నేయించి యటమీఁద నాశ్రయించెఁ గాదె; కావున మీరును నామహారూపంబు చూపిన వీక్షించినంగాని నమ్మతింప రెల్లి మీపేరఁ జంద్రతారాబలంబులు గలిగి యున్నవి. నేనును నాయందుఁగల బలంబు తేటతెల్లంబు చేసెదనని నృపవరునిచే ననుజ్ఞవడసి యారేయి తనమనంబున నన్నుంగూర్చి ఘటికాదశకంబు ధ్యానంబు చేసిన నతండు మదంశసంభవుండు గావున నేనును బ్రీతుండనై ప్రసన్నుండనైతి నప్పవనజుండు నన్నువీక్షించి యిట్లని స్తుతించె. 152

దండకము. శ్రీమన్మహాదేవ దేవాది దేవస్ఫురచ్చారుకోటీరదేదీప్యమానోల్లసద్రత్నకాంతిచ్ఛటామండితాంఘ్రిద్వయా యద్వితీయా క్రమా విక్రమా చారుహస్తప్రశస్తా బుధస్తుత్య సత్యాంగకా సత్యభాషా విశేషాహిభూషా సురాధ్యక్ష దక్షాధ్వరధ్వంస కంసారిమిత్రా త్రినేత్రా సుగంగాకళత్రా మహాగాత్ర యీశా మహేశా సురేశా ప్రకాశా నిశాటోద్ధ్వజూటా వృషాధీశఘోటా శివా పావకజ్వాలినీసత్పదా ఘోరసంసారదూరా హరా నిర్వికారా మహాకార కారుణ్యపాథోనిధీ ధీనిధీ మార

---

1 శ్రమయును దైన్యంబు జననంబు మరణంబు నమరులరీతి నాయందు లేవు.

భూతిప్రియా భూతనాథా జగన్నేత మృత్యుంజయా కృత్తివాసా మహోల్లాస పంచాననా పంచబాణాంతకా బాణపక్షా విపక్షక్షయా యక్షయా యక్షగంధర్వ విద్యాధరానీకసంసేవ్య భవ్యా మహానీలభద్రేభచర్మాంబరా ! తాండవాడంబరా పాండురాటోపశుంభద్యశోభూషణా శంకరా శంభు సర్వజ్ఞ సర్వాత్మకా సర్వ సర్వంసహాదేవతాపారిజాతా యతీతా మృడాఖ్యాత శ్రీకంఠ లోకేశ్వరా శాశ్వ తైశ్వర్యసంపన్న యాపన్నలోకావనా పావనా పాపవారాశిభుగ్బాడబా వేదబా లన్నియున్నాని నీబంటుగాఁ బూని రక్షింపవే భర్గ సత్పుణ్యమార్గా నమస్తే నమస్తే నమః. 153

ఉ. మారుతి యిట్టిరీతిఁ బలుమాఱును సన్నుతిచేయ నే నొగిన్
ధీరత నుత్సహించి యతితీవ్రత డాసి కపీంద్ర మెచ్చితిం
గోరుము దేనినైన నది గొబ్బున నిచ్చెద నిర్వహించెదన్
వారక నిన్నుఁబోలు గుణవర్ధనుఁ డెచ్చటనైనఁ గల్గునే. 154

వ. అని యనేకప్రకారంబుల మన్నించితి నతండు ప్రార్థించి నాతో నిట్లనియె అయ్యా నెయ్యంబు నామీఁదఁగలదేని పూని ప్రళయకాలంబునమీద విశ్వరూపంబు దాల్చు నెడ మీయందునెట్టిమహిమంబు ప్రవర్తిల్లు నట్టిదుస్సరీక్షం బగుతేజంబును విమత శిలీముఖాప్రతిహతత్వంబును దయ నొసంగు మనుడు నేనును సమ్మతించి యట్లకాక యని దీవించి కైలాసంబునకువచ్చితి తదనంతరం బాహనుమంతుండు తనతండ్రిని వాయుదేవుని దలంచె నతఁడును బుత్రునియెడం బ్రసన్నుండై యసదృశజవంబును అభేద్యత్వంబును నొసంగి చనియె నంత. 155

ఉ. సమ్మదమంది రాముఁ డొకసౌధము[1]నందవరూపుచూడఁ జి
త్తమ్మునఁ గోరి మీఱి తనతమ్ములు రావణుతమ్ముఁడుం బ్రమో
దమ్మునఁ గొల్వ మంత్రు లుచితంబుగఁ జేరి భజింప నున్నచో
నమ్మరులాక్షజుం డటకు నల్లనవచ్చె విశేష మేర్పడన్. 156

క. ఈరీతివచ్చి రాఘవు, భూరిపదంబులను వ్రాలి భువి తనమూర్తిన్
వారకచూప ననుజ్ఞులు, భోయనఁ గాని చెలఁగి వాయుపుత్రుం డచటన్. 157

సీ. తనదువాలంబుమార్తాండప్రచండరథమ్మున కుగ్రకేతనముగాఁగఁ
దన మోము సత్యలోకనివాస జలజాతభవచతురాస్యచుంబనము సేయఁ

1 మీఁదనునుండి ప్రేమ చి.

దనపటుదీర్ఘదోర్దండప్రభావంబు డిగ్గజంబుల నెల్లమ్రొగ్గఁ జేయఁ
దనబర్బరస్థూలతను మహామహిమంబు నీరజజాండంబు నిండుకొనఁగఁ
గీ. దనదుభారంబునకు మహీతలము వణఁక, భూరినక్షత్రములు మొలప్రాసలుగను
బెరసి లోకంబులకునెల్లభీతిగదుర, విలయభైరవ మూర్తియై వెలయుచుండె. 158

చ. మఱియును వక్షమందునను మాధవుఁడుఁన్ ముఖమందు నగ్నియుఁన్
శిరమున నిర్జరేంద్రుఁడును జెక్కుల నశ్వినులున్ మహోజ్జ్వల
చ్చరణతలోరుమధ్యముల సర్వనిలింపులు సిద్ధసాధ్య కి
న్నరగరుడోరగాదులు ఘనంబుగఁ గన్పడి రొక్కసెట్టునన్. 159

వ. ఇట్లపారపారావారగంభీరధీరవిస్తారశరీరుండును అప్రతిద్వంద్వశౌర్యుండును వాలప్రచండభుజాదండసత్త్వతృణీకృతాఖిలదిశావరణుండును దుర్నిరీక్షతేజస్సంఛాదితబ్రహ్మాండకోటరుండును, చరణపరాక్రమితభుజంగమవల్లభుండును, తీక్ష్ణరోమాగ్రచుంబితసమస్తనక్షత్రనిచయుండును నిశ్వాసప్రభవఝంఝాప్రభంజనోద్ధూతవిపక్షరక్షోమేఘపటలుండును నగు మహామహునిఁ నిరీక్షింపఁజాలక సుమంతప్రముఖమంత్రులును దక్కినదొరలునుం దలలెత్త వెఱచి భయకంపితదేహులై యుండిరి. లక్ష్మణభరతశత్రుఘ్నులును దదీయమహిమాతిశయంబు గాంచి యిట్టిట్టని వర్ణింపనేరక నిర్విణ్ణమనస్కులై ప్రవర్తిల్లిరి. రామభద్రుండును దదత్యుద్రరౌద్రరేఖావిశేషంబునకుఁ బరమాశ్చర్యహృదయుండై యితని సహాయంబున శతముఖుం దునుమవచ్చు సందియంబు లేదని నిశ్చయించి అభంగకృపాపాంగంబుల నమృతంబు చిలుక నవలోకనంబు చేసి మెల్లన నిట్లనియె. 160

ఉ. శాంతవిచార వాయుసుత శత్రుగణాంతక మారుతే హనూ
మంత మహానుభావ యఘమర్దన నీవగురూపు మాడ్కిఁగా
నెంతటివారు రాజులు కపీశ్వర నాకనుశంకపుట్టెనేఁ
[1]డింతియె చాలు నీ విపుడ యెప్పటిరూపము మాకుఁ జూపవే. 161

ఉ. నావిని వాయుజుండు నరనాథున కెప్పటిమాత్రతోడుతన్
వానిఁవందనంబు లిడి వచ్చి [illegible] దండనుండె న
ద్దేవుఁడు రామచంద్రుఁడు నతిప్రియభాషల మాటిమాటికిం
చేవ దలిర్ప సన్నుతులు సేయుచునుండె ననేక భంగులన్. 162

వ. అంత. 163

1 దంతయుఁజాలుఁజాలుఁ గరుణాత్మక యెప్పటిరూపుఁజూపవే.

గీ. పవననందను ఘోరరూపంబుఁ జూచి, మునుపు దనుమ్రింగి యందుచేఁ దనివిలేక
యిప్పటికిఁ దన్ను మ్రింగునో యనుచు భీతి, నేగుకైవడి నపరాబ్ధినినుఁడు గ్రుంకె.

గీ. రాఘవుఁడు తొల్లిలవణవారాశిగట్టె, నిప్పుడిదియేడఁగట్టునో యింక నిలువ
బాగుగాదని చనిమిన్ను ప్రాఁకునట్టి, చటులబడబాగ్నిశిఖలన సంజ వొడమె. 165

గీ. [1]ప్రాగ్వధూమణిదననఖప్రకరములను, విప్పికొప్పునఁ జీఁకటి వెల్లవిరిసె
నబల వెండియుఁ బవరించునట్టి సొబగు, చూచుదర్పణ మనశశి దోఁచె నపుడు.

గీ. అంతకంటెను మున్ను భటాళిగొలువఁ, గొలువు చాలించి యానృపకులవరుండు
వెలయ సంధ్యాద్యనుష్ఠానవిధులుదీర్చి, యనిలజవిభీషణులఁ బిల్చి యాక్షణంబ. 167

వ. వారునుం దానును సహోదరత్రయంబును బంక్తిం గలసి మరకతపలాశపత్రంబుల షడ్రసోపేతరుచిరాన్నంబులును మృగపక్షిమాంసంబులును విచిత్రశాకంబులును ఘృతదధిప్లుతంబుగా నానావిధంబు లగునూరుఁగాయలతో నరుచిపరిహారంబుగా నారగించి కర్పూరతాంబూలంబులు గైకొని తదనంతరం బావిభీషణు నవలోకించి మహాత్మా యిట్టిసమయంబునఁ జతురంగబలంబులతో మత్సహాయుండవై యేతద్దుష్కరకార్యం బెట్లైనను దొలగించి నిర్వహింపుమని యనర్ఘమణిమయభూషణంబులు నపారదివ్యాంబరంబులు నసదృశపరిమళంబులును దోరహత్తుగా నిచ్చి పనిచె నతండుసమ్మతించి రామచంద్రునకు నమస్కరించి లంకాపురంబున కరిగె పిదప రఘువరుండు హనుమంతు నవలోకించి యనేకప్రకారంబుల నాదరించి తనకంఠంబున నొరయు దివ్యరత్నహారంబు కపివరునిగళంబునం దగిలించి నీవును లక్ష్మణుండును గిష్కింధానగరంబున కరిగి యేతద్వృత్తాంతం బంతయుఁ సుగ్రీవున కెఱింగించి సకలవానరసహితంబుగాఁ దోడితెమ్మనుచు హర్షించి లక్ష్మణుండును వాయుజసహితుండై తత్పురంబున కరిగె మఱియును భరతశత్రుఘ్నుల వీక్షించి మీరును కాంభోజమలయాళద్రవిళ కర్ణాట లాట కిరాత కోసలపాంచాల సౌరాష్ట్రాదిదేశంబులకుం జని యాయారాజులఁ దోడి తెండని పనిచె తానును సీతాసమేతుండై హంసతూలికాతల్పంబునఁ దత్ప్రకారంబులు వినిపించుచు విక్రమించె నంత. 168

గీ. కాలమనుసింహ మాకాశగంధగజముఁ
జేరి తత్కుంభమధ్యంబుఁ జింప నందుఁ
దెలివిఁ గన్పడు గొప్పముత్తియ మనంగఁ
జొక్కమగునట్టి వేగురుఁజుక్క వొడిచె. 169

1 ప్రాగ్వధూమణి తనరఃగఁ బ్రాభవమున విప్పి కొప్పును వీఁపున విడిచె ననగ.

గీ. తారకలు దాఁగెఁ గుక్కుటధ్వనులు మీఱెఁ, గలువ గమిజాఱె మదనుని ఘనతదీఱె
గంజములు గేరెఁ జల్లగా గాడ్పు సేరె, దీపతతులాఱె బలబల తెల్లవాఱె. 170

గీ. నెమ్మి నంబర మనియెడుకమ్మరీఁడు, గరిమఁ బ్రాగ్భాగ[1]సాంధ్యరాగంబుకొలిమి
యందుఁ గ్రాఁగినయట్టిలోహంపుముద్ద, వెడలఁ జేసెనొ యనరవిపొడిచె నపుడు. 171

సీ. ఆవేళ రఘురాముఁ డల్లన పల్లకీమృదులస్వరంబున మేలుకాంచి
కాలోచితక్రియల్ గ్రక్కునఁ గావించి మఱియుఁ గురువునకు నమస్కరించి
విప్రవర్గములకుఁ వెసనర్ఘ్యతాంబూలతతు లిచ్చి మఱిప్రమోదంబు గదుర
మణిభూషణంబులు మహితాంబరంబులు గైకొని సన్మంత్రిగణము గొలువ
గీ. సకలవానరరాక్షససైన్యచయము, లెప్పు డరుదెంచు శతముఖు నెపుడు ద్రుంతు
ననుచు సింహాసనంబున నలరి రాము,డుండెఁ బేరోలగము నయనోత్సవముగ. 172

మాలిని. సరసిజదళనేత్రా చారునీలాభ్రగాత్రా గిరిసుతపతిమిత్రా గీష్పతిస్తోత్రపాత్రా
... .. సౌజన్యపాత్రా నిరుపమగుణసూత్రా నిర్మలారూఢవేత్రా.

గద్యము. ఇది శ్రీమదేయకూర్తినివ సల్లక్ష్మీనృసింహకరుణాకటాక్ష సంప్రాప్త మహాకవిత్వవిద్యాపారీణసుమహితాంధ్రగీర్వాణభాషాప్రవీణ సంగీతలక్షణధురీణ సకలవిద్వన్మిత్రాత్రేయసగోత్రపవిత్ర ధర్మనాచార్య ధర్మనార్యపుత్ర నిఖిలమహీసురాశీర్వాదప్రవర్ధమానభాగధేయ సకలనృపవిధేయ వినయవిధేయ మర్దననామధేయ ప్రణీతంబైన సీతావిజయంబను మహాప్రబంధమునందుఁ బ్రథమాశ్వాసము సంపూర్ణము.



1 సాంధ్యంబు కలిమికొలిమి.

# ద్వితీయాశ్వాసము.

క. శ్రీకర సద్గుణగణర, త్నాకర కమనీయతరకృపాకరపూర్వా
భీకరతనురుచివిజితసుధాకర, [1]గోచమ నృపాల ధర్మవిశాలా.

వ. అవధరింపు మత్తెఱంగున శాంకరీదేవికి వెండియు మహాదేవుం డిట్లనియె. అట్లు సకల బాంధవామాత్యపురోహితసామంతసద్భటవిద్వత్కవిగాయకనాయకసంఘంబులు గొలువ నఖిలనృపసార్వభౌముండగు రాముండు వసిష్ఠుండు నీతివచనంబులు నితిహాసంబులు దెలుపఁ బేరోలగం బుండి శతముఖశతద్వయదోర్దండఖండనాభిలాషుండై విభీషణ సుగ్రీవముఖ్యసకలసేనాగమనకాంక్షనుండె నంత. 2

సీ. ఆవిభీషణుఁడు[2]లంకాపురికేగి తనబంధుమిత్రులఁ దవిలిపిలిచి
యిచటివృత్తాంతంబులెల్ల నెఱింగించి యిట్టివేళల మన మినకులేంద్రు
నకుఁ దోడుగావలె నిఁకజాగుసేయక యఖిలసాధనములు నమరఁజేసి
రథములుసవరించి ప్రథనభీకరగంధసింధురంబులు నేర్చి చిత్తములకు

గీ. మించువేగంబుగలిగెడుమేటిహరులఁ, బోటుగత్తులఁ దూలెడు నీటుభటుల
నాయితంబులు సేయించి యతిరయమున, వరుసఁ దెమ్మని తగఁబడవాళ్లఁ బనిచె. 3

సీ. పనిచి తోడ్తోడ సంపాతిని నలనీలసత్ప్రధానుల నెల్ల సరగఁ బిలిచి
వేర్వేర మన్నించి దుర్వారబలులార మీరు నాకోర్కి లింపారసలిపి
యొక్కొక్కరుని వెంట నొక్కొక్క క్షౌహిణికొలిచి రా నరుదెండు బలిమిమెఱసి
దారపుత్రభ్రాంతిఁ దనరినదుర్మతుల్ రాఘవుఁ డిచ్చటనెపరానుగాకుఁ

గీ. దనుచు నెఱిఁగింప నమ్మంత్రివాహినులును, తమ్ముసేనలు గైకొని మత్సరించి
[3]పరరంగనాయుధములుతమ ప్రాణములుగఁ, జేసి యుద్ధప్రయత్నముల్ సేసి రపుడు. 4

సీ. ఒనర నిత్తెఱఁగున యుద్ధసన్నద్ధులై కరిరథభటతురంగములు గొలువ
నప్పుడేకైకమహాక్షౌహిణులతోడ మలయుచుఁ బదుగురుమంత్రివరులు
భేరీమృదంగగంభీరభాంకారముల్ జగతీతలము నాకసంబు నిండ
నాహావజయనిష్ఠురాలాపములు మీఱఁ జనుదెంచి యవ్విభీషణునియెదుట

గీ. గదలు వెసఁజాఁచి ముసలముల్ ఘనత నూఁచి, ప్రాసములు ద్రిప్పి పట్టిసప్రతతిరొప్ప

---

1 గౌతమ. 2 లంకాపురంబునకేగి. 3 పరగణవు సాధనంబులు.

సాయకము లేర్చి సంగరసరణి నార్చి, నేర్పు సూపిరి దోర్బలనిష్ఠ మెఱసి. 5

వ. ఇట్లనేకప్రకారంబుల హరుండును నీలుండును సంపాతియు నవత్రుండును వక్రజిహ్వుండును శూలముఖుండును రక్తవదనుండును వికటవదుండును కుటిలకేశుండును ఉలూకుండును మహాగర్భుండును వికృతపార్శ్వుండును నాదిగాఁగలమంత్రులందఱు పౌడచూపిన నుత్సహించి అవ్విభీషణుండు వారల నాదరించి తానును నిజాభ్యంతర మందిరంబునకుం జని సకలబ్రహ్మగాత్రసభాషితానేకశ్రుతీతిహాసంబులు వినుచున్నతల్లికి నమస్కరించి రణప్రయాణవృత్తాంతం బంతయుం వినిపింప నక్కైకేశియు విజయుండవై మఱలిరమ్మని దీవించి యక్షత లిచ్చినం గైకొని అచట వీడ్కొని మహాపతివ్రతాశిరోమణియగు సరమాదేవికిం జెప్పిన నప్పరమసుందరియు మందహాసంబు గావించి దూర్వాక్షత తాంబూలనిచయంబులు దోయిటం గొనివచ్చి యిచ్చి యిట్లనియె. 6

చ. రమణ దయాత్మ నీతిగుణరత్నమ భండన భూమిలోన మీ
రమణునకుఁ జయంబుగొని రమ్మని పంప విభీషణుం డొగిన్
సుమహిత రత్నవిస్ఫురితషోడశచక్రసహస్రఘోటకో
త్తమశతఘంటికాయుతరథంబు ముదంబున నెక్కి సారెకున్. 7

శా. శంఖారావము దంతిబృంహితములున్ సర్వస్ఫుటోత్పృచ్ఛటా
రింఖాఘట్టనఘోషణంబులును మౌర్వీనాదముల్ వేగవ
త్క్రంఖాణోగ్రవిహేషలుం బణవఢక్కాధ్వానముల్ ఘోరతం
బుంఖీభూతములై చెలంగె నరయన్ భూభాగమధ్యంబునన్. 8

వ. ఈక్రమంబున విక్రమశీలుం డైనవిభీషణుండు సకలసేనాసమన్వితుండై లంకానగరంబు వెలువడి దినదినక్రమంబున సముద్రంబులును లోకంబులును మహావనంబులును పర్వతంబులును ప్రవాహంబులును దేశంబులును ఘనతరగ్రామంబులును గడచి సాకేతపురిప్రాంతమునకుం జని తనరాక రామచంద్రున కెఱింగింపఁ బనిచె నంత.

మ. దనుజుండుం జని రాముఁ గాంచి కరుణాపిండంబు లర్పించి యో
జననాథాగ్రణి రామచంద్ర భవదాజ్ఞామార్గ మెల్లం దలఁక్
ఘనతన్మోచి విభీషణుండు [1]చతురంగద్వాదశాక్షౌహిణుల్
దను సేవింపఁగ వచ్చి నచ్చుఁ బనిచెం దద్వార్త విన్పింపఁగన్. 10

1 చతురంగంబుల్ దశాక్షౌహిణుల్.

ఉ. నావిని రామభద్రుఁడు రణక్రియ మేర్పడ మిన్నుముట్టిసం
భావన లిచ్చి మంత్రులును బాంధవులుం దనుఁగొల్వరాఁగ [1]భూ
దైవత కోటిసారెకు ముదంబున దీవనలియ్య జయ్యనన్
రావణవైరి యొక్కగజరాజము నెక్కి పురంబు వెల్వడెన్. 11

ఉ. ఆరథకోటి భీషణము లామదదంతి[2]మహోన్నతక్రమం
బారయ నిర్జితానిలమహాశ్వసమూహజవప్రభావిధం
బారణధుర్యసద్భట మహోర్భటవృత్తియు నెల్ల నొయ్యనన్
వారక చూచి మెచ్చి జయవర్ధనుఁడై ముదమందుచుండఁగన్. 12

ఉ. తోషణుఁడున్ మనోవిగతదూషణుఁ డుజ్జ్వలసూనృతోల్లస
ద్భాషణుఁ డాశ్రితావనవి[3]ధానవిభూషణుఁ డుగ్రశత్రుహృ
ద్భీషణుఁ డార్యచర్యుఁడు విభీషణుఁ డల్లనవచ్చి మ్రొక్కెఁదు
ర్దోషవనీకుఠారునకు దుష్టవిదారునకున్ నయంబునన్. 13

వ. ఇట్లు పరమభక్తుం డగువిభీషణుండు ప్రణమిల్లిన నల్లనఁ దనభద్రదంతావళకుంభమధ్యంబునకు రాఁదిగిచి మణిభూషణాంబరపరంపర లొసంగి గాఢాలింగనంబు గావించి బలంబులు విడియ నొక్కబాహ్యారణ్యప్రదేశంబు చూపించి అచ్చటనుండ నియమించి విభీషణునొక్క భర్మహర్మ్య ప్రాసాదంబున నునిచి రాఘవుం డారాత్రి వాసవప్రముఖత్రిదశులం బ్రార్థింప బృందారకులందఱు ప్రసన్నులై మహాత్మా వరంబేమైన నడుగు మనిన ముదంబంది వినయంబున సురలం గనుంగొని నేఁడాదిగ శతముఖుండు మడియందనుక సకలమనుజదనుజవనచరబలంబులకుఁ దృష్ణాహారవాంఛలు వొడమకుండ దయచేయుం డనిన నట్లకాక యని దీవించి యంతర్ధానంబు నొందిరి రఘూద్వహుండును సుగ్రీవప్రముఖనిఖిలశాఖామృగంబుల రాక కెదురు చూచుచుండె నాసమయంబున. 14

శా. దుష్కర్మక్షితిభృత్కఠోరపవిసంతుష్టాత్ము డెల్లప్పుడున్
నిష్కౌటిల్యవిచారుఁ డుత్తమగుణానీకుండు శత్రుచ్ఛటా
శుష్కారణ్యదవానలుండును కృతస్తోముండు సౌమిత్రియా
కిష్కింధానగరంబు చేరువను సుక్షేమంబు పై నిల్చుచున్. 15

సీ. అనిలజ నీవేగి యర్కనందనుఁ గాంచి యటఁ బుట్టినట్టివృత్తాంతమెల్లఁ
జెప్పి నేవచ్చుటచెప్పి రామునియాజ్ఞ చెప్పి యీడకు నతిశీఘ్రవృత్తి

---

1 భూదేవత లెల్ల సారెకును దీవన లిచ్చుచుండఁ. 2 మహోతివిక్రమం.
3 ధారవిభూషి.

సకలశాఖామృగసహితంబుగా యుద్ధసాధనములతోడ సరవిఁదోడి
తెమ్ము రాకుండిన దిగ్గున నరుగుదె మ్మటమీఁద నాచేత నౌనుగాని
గీ. యనినఁ బనిపూని హనుమంతుఁ డతిరయమున,నచట వీడ్కొని కిష్కింధ కరిగియఖిల
వానరులు దన్నెదుర్కొని వందనములు, సేయఁబట్టణమధ్యంబుఁ జేరి యచట. 16
శా. ఉగ్రారాతిపయోధిబాడబుని విద్యుత్సన్నిభాత్మున్ రణో
దగ్రున్ బాహుబలప్రతాపఘనుమార్తాండాత్మజున్ భూరిహే
మగ్రావప్రతిమానధైర్యు రఘురామ శ్రీపదధ్యాను నా
సుగ్రీవుం బొడఁగాంచె నంత నతఁడుం జూచె న్మరున్నందనున్. 17
క. కనుఁగొనియెదురుగఁ జని యా, హనుమంతునిఁ గౌఁగిలించి యలరుచు నర్ధా
సనమున నిడి[1]తత్కుశలం, బనుపమకృప నడుగ నిట్టులంతయుఁ జెప్పెన్. 18
చ. విజయము రామచంద్రునకు వీరపరాక్రమలక్ష్మణాఖ్యుకున్
విజయము మద్గురమ్మలకు వీరపతివ్రత భూమిజాతకున్
విజయము కైకసూనునకు వేడుక శత్రువినాశమూర్తికిన్
విజయము భానునందనప్రవీణధురీణ నిరంతరంబుగన్. 19
వ. అని. 20
సీ. పలుక ఫాలమున నంజలి వేడ్కఁ గీలించి వెండియు నిట్లనె విమలగతిని
నాతండ్రి దశరథనందనుం డారామభద్రుఁ డున్నాడె సంభ్రమ మెలర్ప
భండనోదగ్రప్రభావుఁ డాలక్ష్మణుం డతని సేవించునే యనుదినంబు
భరతశత్రుఘ్నులు ప్రమదులే మాతల్లి జానకి కుశలిన్యై సరవిగనునె
గీ. విధవలై యున్నదశరథవిభుసతులు, కొమరులను జూచియైనను గొంతవగపు
మానియుందురె రాజసన్మాన్యుఁ డగుచు, నావసిష్ఠుండు మెలఁగునే యచట ననఘ.
గీ. చూచినాఁడవె యాలోనసొంపుగమున, రఘుకులోన్నిని [illegible] సభల
సరవిఁబుట్టునె యవ్విభీషణునివార్త, వేడ్కఁ దలఁతురె యొక్కొకవేళ మమ్ము. 22
సీ. నావిని చెలువవ్వ నవ్వి సుగ్రీవుని మన్నించి యాహనుమంతుఁ డనియె
రామాదిదశరథరాజనందన చతుష్టయము సున్నారు సంభ్రమముల
సీతామహాదేవి చెన్నొంది పతిసేవ సేయుచు నున్నది నేమమునను
గరిమఁ గౌసల్యాదికాంతలు కొడుకులు మన్నింప నున్నారు మానవతులు
తే. నవ్వసిష్ఠుఁడు నున్నవాఁ డతిముదమునఁ, గడువిభీషణుఁడును రామకడనెయున్న

1 రామ శుభంబులు తత్కుశలంబు నడుగఁ బొలుపుగఁ మాఱియున్.

వాఁడు నేనును నటనుండివచ్చితాఁడ, నిన్ను నెప్పుడు రఘురాముఁ డెన్నుచుండు.
వ. అనిన విని యినసుతుం డనిలజు నవలోకించి యిట్లనియె మహాత్మా విభీషణుండు రామునికడనుండుటకు నాశ్చర్యంబును భయంబునుంబుట్టె ఎట్టిచందంబున నరు దెంచె ఏమికార్యం బెఱింగింపుమన హనుమంతుం డిట్లనియె. 24
సీ. రావణుకంటెఁ బరాక్రమవంతుండు శతముఖుఁ డనెడురాక్షసవరుండు
గోవిప్రదేవతాక్షోభంబు గావింప నందుకు రాఘవుం డలిగి మునుల
కభయహస్తము లిచ్చి యాహవంబునకు సహాయంబు రమ్మని యడుగ నవ్వి
భీషణుం డొదఁబడి భీషణశౌర్యుఁడై చనియె లంకకు రిపుల్ జలదరింప
గీ. నిన్ను రమ్మని నృపు డంప నేను లక్ష్మణుండు వచ్చితి మిటకు నుద్దండగతుల
వాఁడె సౌమిత్రి మనపురద్వారశుంభ, దుపవనంబున నున్నాఁడు తపనతనయ. 25
ఉ. నావిని తల్లడిల్లి దిననాయకనందనుఁ డుల్కిపాటునం
బావనినుంచి లేచి నిజభర్తృగృహంబునకేగి తారతో
నావిధమెల్లఁ జెప్పి కనకాంబరభూషణరత్నవస్తువుల్
వావిరి కానుకల్ గొనుచు వచ్చె బురోపవనంబు సేరఁగన్. 26
చ. ఇటువలె వాయుజప్రముఖు లేకముగాఁ దనుఁగొల్చిరాగ మి
క్కుటమగు భక్తితో నినుని కూరిమిపట్టి రఘూద్వహానుజుం
దటుకునఁ గాంచి వందనశతం బొనరించి యనేకభంగులన్
స్ఫుటమృదుభాషణంబులను [1]భూషణచేసి ముదం బెలర్పఁగన్. 27
ఉ. కానుక లిచ్చి యోదనుజఖండన యోనరనాథచంద్ర యో
దీనశరణ్య యోవిమలతేజ భవన్నిజభృత్యుఁడం గదుక్
నేనలతోడ నెద్దియటఁ జెప్పుము వేగ నొనర్తు నన్నఁ ద
ద్భానుతనూజుఁ బిల్చి బహుభంగుల నాదరణంబు సేయుచున్. 28
*చ. వినుము కపీంద్ర యొక్కయవివేకపురాక్షసుఁ డిప్పుడుట్టి స
న్మునులను గోకదంబముల మూర్ఛతఁద్రుంచుచు దేవకోటులక్

1 స్తోత్రముచేసి.

* వినుము కపీంద్ర యొక్కని వివేకవిహీనుని రాక్షసాధముక్
మునులను గోకదంబముల మూర్ఛలఁబుచ్చుచు దేవతాదులక్
ఘనముగఁ బాధపెట్టుచును గర్వమునొంద భయార్తులైనయీ
మునులను గాచెఁ బంక్తిరథపుత్రుఁడు చేకొని వేడ్కమీఱఁగక్

ఘనముగ బాధపెట్టుచును గర్వముచే నెదురెందులేక యే
చిన నదియెల్లఁ దాపసులు చెప్పిన వారలఁ గాచె వేడుకన్. 29

వ. ఇవ్విధంబునం గాచి యమ్మహాదానవుం బరిమార్చుటకుఁ బ్రతిజ్ఞ సేయువాఁడై పరపురుషాసాధ్యంబులగు వరంబులు పరమేష్ఠి యొసంగె నందులకు నాలుగుసముద్రంబులు దాఁటవలయు నని చింతింప నందుల కేనొయ్యన డాసి మాపంపున నేనొక్కరుండనే చతుర్దశభువనంబులు భస్మీకరింతు ఒక్కరక్కసి కేనిక్కై యింతవంత నొందనేల యని పలికిన నలరి యిందుకు సందియంబులేదయినను బెక్కురక్కసులలో నొక్కరము మెలంగుట తగదని విభీషణుం దలంప నతండు వచ్చి తన సేనలతోఁ జనుదెంచెద నని చనియె ఇంతకువచ్చునో రాఁగలఁడో యెఱుంగము నేనును హనుమంతుడును సీతోడఁ దద్వృత్తాంతంబుచెప్పి నీసహాయంబు గొనవచ్చితి మిటమీఁద నీదిభారం బని యూరకుండె. సుగ్రీవుండును ముదంబున నందుకు సమ్మతించి యిట్లనియె. 30

శా. దేవా వాఁడన నెంత నానరచమూదీప్తప్రతాపాగ్నికీ
లావర్గం బెసఁగించి దానవసముల్లాసాటవిం గాల్చి భూ
దేవాళిం గరుణించెదర్ మదినిఁ జింతింపంగ మీకేల యీ
నావంటిం బ్రియభృత్యుఁ డుండఁగ ధరానాథాగ్రచూడామణీ. 31

సీ. మలయాచలంబున మాల్యవంతంబున హిమవంతమునను మహేంద్రమునను
గనకాచలంబున గంధమాదనమున నీలాద్రినలమలయాళగిరిని
శేషాచలంబున సింధుపర్వతమున మునుమిడి యల ఋశ్యమూకమునను
వనచరవర్గముల్ ఘనతతో నున్నారు వారి రాఁ బనిచెద వచ్చుదనుకఁ
గీ. బంచరాత్రము లిచట సంభ్రమతనుండుఁ, డనుచుఁ బ్రార్థింప లక్ష్మణుఁ డనుమతించి
పంపక డనుండెఁ బవనజప్రముఖు లలర. భానుజుండును రాఁబంచె బలమునెల్ల. 32

వ. ఇట్లు సుగ్రీవుండు సకలకుధరగహనతటాకంబులకడకుఁ దనభృత్యులం బనిచె పనిచిన వారును తత్తత్ప్రదేశంబులకుం [illegible] రామునిపదంబులక్రింద నానవెట్టి యఖిల భల్లూకవానరనివహంబులం [illegible]చి మరలఁ జనుదెంచి రంత. 33

చ. మలయనగంబునుండి పలుమాఱును రామునిఁ జేరుకొంచు వె
ల్వలుదశసంఖ్య దన్నుఁ గొలువంగ రణోచితఘోరవాక్యముల్

---

చ. *మలయనగంబునుండి పదివేలబలంబులు దన్నుఁ గొల్వఁగా
బలుపఱుఖండనక్రమత పాటలుపాడుచు సంభ్రమంబున

నలుపుచు నార్భటంబుల దిశావలయంబులు తల్లడిల్లఁగాఁ
జెలఁగుచువచ్చె నప్పుడు సుషేణుఁడు భానుసుతుండు మెచ్చఁగన్. 34

ఉ. వాలముల న్మహాకుధరవర్గములం బెకలించి మింటికా
ఖీలతవైచి మర్లనవి బెట్టుగఁ బట్టుచు హుంకరించుచున్
హేలిఁ బదాఱువెల్వ లపు డెమ్మినిఁ గొల్వఁగ గోముఖుండు న
న్నీలుఁడుఁ గూడివచ్చిరల నీలనగంబుననుండి చెచ్చెరన్. 35

ఉ. ధర్మనగంబునుండి చలపాదికపుల్ నవలక్షగొల్వఁగా
నర్మిలి వెల్వలై చనుచు నప్రతిమానభుజాబలంబులన్
దుర్మదవృత్తి నార్చుచును దోయధులెల్లఁ గలంగిపొంగ జ్యో
తిర్ముఖుఁ డేగుదెంచె నతితీవ్రరయంబున రాముఁ దల్చుచున్. 36

చ. వివిధపరాక్రమస్థితుల వెల్వలు తొమ్మిదిగొల్వ నభ్రమున్
భువియును నిండ నార్చుచును బొంగుచు గంతులు వేయుచు న్మహా
జవమున నిర్జరావళులు సన్నుతిసేయ విరోధిభీములై
గవయుఁడు గంధమాదనుఁడు గ్రక్కునఁ జేరిరి యుక్కుమీఱఁగన్. 37

చ. శతబలియున్ గవాక్షుఁడును శౌర్యధురంధరుఁ డైనమైందుఁడున్
జతనముతోడఁగూడి దశసంఖ్యను వెల్వలు దమ్ముఁ గొల్వ నీ
క్షితిజము లొక్కటం బెఱికి చేకొని త్రిప్పుచు గంతువేయుచున్
మతములఁ జేరిరయ్యెడకు మాద్రిగిరీంద్రమునుండి యత్తఱిన్. 38

వ. మఱియును నదియునుంగాక మూఁడుకోట్లతో ద్వివిదుండును రెండర్బుదంబులతోఁ బనసుండును ఎనుబదిసహస్రంబులతో భల్లూకనాయకుండును ఏడక్షౌహిణులతో ఋషభుండును పదునొకండుపద్మంబులతో వేగదర్శి తారక కుముదులునుగూడి నానాపర్వతంబులనుండి చనుదెంచి రవియెల్లను బంద్రెండువెల్వలయ్యె కిష్కింధను ఋశ్యమూకంబునంగల వానరబలం బెనిమిదివెల్వలయ్యె నానాముఖంబులంగల కపిసేన యొక్కవెల్వయయ్యె అన్నియును డెబ్బదిరెండువెల్వలై ప్రవర్తిల్లె నంత. 39

---

న్మెలఁగుచు రాము దల్చుచును మేదిని నాకసమంట నార్చుచు
జెలఁగుచు వచ్చె నప్పుడు సుషేణుఁడు భానుసుతుండు మెచ్చ[illegible]

ఉ. నీలనగంబునుండియును నీలుఁడు గోముఖుఁడున్

. . . . . . . . .

బాలదివాకరాత్మజుని ప్రాపును జేరి మనోవికాసులై.

*సీ. శతకోటిలక్షలు శైలచరావళుల్ గదిసిన మొనయనఁగాను బరఁగు
మొనలఱువదిలక్ష లనువుగాఁ గూడిన నదిలోకమున బారు వనఁగ నొప్పు
నట్టిబారువలు సహస్రంబుపూఁగిన నది మహాదళ మన నవనిఁ జెల్లు
దళము లర్బుదమైన దాని పేరంబరసంఖ్యయందురు మంత్రిజనము లెల్ల
గీ. నట్టి యంబరములు కోటియైన నొక్క, వెల్లు వనఁదగు నటువంటి వెల్లువలేదు
పదులురెండును సేవించు భానుసుతుని, నట్టివెల్లను జేకూడె నద్భుతముగ. 40

సీ. ఎచ్చోటఁ జూచిన నచ్చోట నేల యీనినభంగిఁ గనుపట్టి నిలుచువారుఁ
దతఘోరసింహనాదములనక్షత్రముల్ దొరఁగ మిన్నులుముట్టఁ బెరుఁగువారుఁ
గాలునిబోలిన వాలంబు లంకించి యాలంబునకు నసియాడువారుఁ
బర్వతంబుల నిమ్మపండ్లచందంబున నఱచేతులను బంతులాడువారు
గీ. నుఱికి సాలమహీజముల్ పెఱికి తెచ్చి, తివిరిఁ బలుమాఱు బిఱబిఱఁ ద్రిప్పువారు
నగుచు భూభాగ భూరినభోంతరాళ, మందుఁ గపిమయమైయుండె నట్టియెడను. 41

సీ. సౌమిత్రి యపుడు తచ్ఛాఖామృగాఖిల సైన్యంబు గని మహాశ్చర్యమొంది
పావనిఁ జూచి యోపరమపుణ్యాత్మక ధరణిలో నీకసాధ్యంబు గలదె
యిన్నియు నొకయెత్తు [1]నింతటికంటె నెక్కుడు నీవు గావునఁ దోడరవలసె
నెల్లి పుష్యమి యాత్ర కిది లెస్స సుగ్రీవుఁ బయనంబు సేయింపు రయము మీఱ
గీ. ననుడు సుగ్రీవుఁ దేతెంచె ననిలజుండు, నతఁడు మఱునాఁటియాత్రకు ననుమతించె
రాఘవానుజుఁడును మదిఁ బ్రమదమందెఁ, గపులు నాఁడాడ విడిసిరి విపులముగను. 42

సీ. అంత సూర్యుఁడు గ్రుంకె నపరాచలంబున నారేయి లక్ష్మణుం డరసి జాంబ
వంతుని రప్పించి వింతగా నాతనివలన నదీప్రభావములు గిరుల
మహిమంబులును వినిర్మలతరుఘనలతల్ దేవదైత్యమహానుభావములును
గపులపుట్టువులును గఠినసంగరవర్తనములును గడుసముద్రముల తెఱఁగు
గీ. ముష్టియుద్ధప్రకారంబు మొనసి పెనఁగు, లాడువిధమును బిదప శతాస్యగతులు
వానిమంత్రుల తెఱఁగును బూనికలును, దెలిసికొనుచుండె నంతటఁ దెల్లవాఱె. 43

*మ. శతసాహస్ర మహార్బుదక్షితిదశాసాహస్రకోటీ యుతిం
గతివేధాద్రిహిమాంబుబాణఋషిసంఖ్యానీకమున్నడ్చి యీ
గతిసిక్ రెంట గుణింప వచ్చినమహాలబ్ధం బదెంతాయెనో
క్షితినానాద్భుతమై వనేచరు లనేకుల్ వచ్చెఁ గిష్కింధకున్.

1 ఇంతకంటెను నెక్కుడై నీవు మాకును నడరవలయు,

క. భానూదయకాలంబున, భానుజుఁ డుప్పొంగి రామభద్రానుజునిం
గానంగవచ్చి యిచ్చెను, దానగజశ్రేష్ఠ మొకటి తగఁగవు లలరన్. 44

వ. ఇచ్చి తానును దారాప్రముఖనిఖిలసతీనిచయంబున కెఱింగించి వారిచే ననుజ్ఞలు గొని అంగదముఖానేకపుత్రపౌత్రమిత్రామాత్యవర్గంబులు గొలువ వనచరపురంబు వెడలివచ్చె లక్ష్మణుండును భానుజదత్తమత్తకరటిఘంటాస్ఫాలనకరుండై జాంబవత్సుషేణ కుముద నీల గోముఖ జ్యోతిర్ముఖ శరభ ఋషభ మైంద ద్వివిద పనస శతబలి గజ గవయ గవాక్ష గంధమాదన హనుమత్ప్రభృతులు గొలువ నరుగుదెంచె సకలదళంబులును భూచరఖేచరులై రాఁదొణంగి రంత. 45

గీ. ధరణి దిర్దిరఁ దిరిగె భూధరము లదరెఁ, గలఁగె సప్తాంబురాసులు తలఁకె బ్రహ్మ
యగణితాఖిల సకలశాఖామృగప్ర, చండదోర్దండఖండనోద్దండగతుల. 46

గీ. అమ్మహోత్సవ మరసి రామానుజుండు, కలిగెవిభవంబు మాకునీకతనఁగాదె
యనినఁ బ్రణమిల్లి నీబంట నంతపలుక, నేల యని రవితనయుండు నేగుచుండె 47

ఉ. ఏపున నట్లు భానుసుతుఁ డేగి దళంబులతోడఁ దా నయో
ధ్యాపురవేష్టితక్షితిధరాఘువనంబులఁ జేర రామధా
త్రీపతి తత్తదాగమనరీతులు చారులచే నెఱింగి యుం
ద్దీపితచిత్తుఁడై పనిచెఁ దీవ్రతమంత్రులఁ దా నెదుర్కొనన్. 48

ఉ. ఈగతి రామచంద్రుఁడు దినేశ్వరపుత్రు నెదుర్కొనంగఁ దా
వేగన మంత్రులన్ హితులవృద్ధులరాజులఁ బంప నుబ్బి తా
రాగురుభోగవైభవధురంధరుఁ డారవిపుత్రుఁ డందఱన్
బాగుగ నాదరించి పతిపజ్జకు లక్ష్మణుఁ గొల్చి వచ్చుచున్. 49

ఉ. రామునిఁ బంక్తికంధరవిరాముని నీలపయోదకోమల
శ్యాముని మాని హృత్కుముదసంచయసోముని సత్యభాషణ
స్తోముని సార్వభౌముని విశుద్ధసుకీర్తిగుణాభిరామునిన్
ధీమణిగ్గైన భానుజుఁడు పెగ్గనఁ గాంచి ముదంబు నెక్కొనన్. 50

ఉ. కాంచి తదీయదివ్యపదకంజ యుగంబులమీఁద వ్రాలి తా
నంచితభక్తి లేచి దనుజానుఁజుడైన విభీషణున్ దయా
సంచితవృత్తిఁ గౌఁగిటను జక్కఁగఁబట్టి సుమంత్రముఖ్యులన్
మించుగ నాదరించి మఱి మెల్లన రామునిఁ జేరి యిట్లనెన్. 51

సీ. ఇనకులోద్ధరణాయ దనుజసంహరణాయ రామాయ తేనమో రాఘవాయ
ప్రవిమలసుగుణాయ ప్రణుతమౌనిగణాయ రామాయ తేనమో రాఘవాయ
భువనప్రశస్తాయ భవభయహరణాయ రామాయ తేనమో రాఘవాయ
ఖండనోద్దండాయ దండితవృజినాయ రామాయ తేనమో రాఘవాయ
గీ. రసికజనసార్వభౌమాయ రాఘవాయ, రావణాటవీదహనాయ రాఘవాయ
1రామణీయకకృపాత్మనే రాఘవాయ, రామచంద్రాయ తేనమో రాఘవాయ. 52

వ. అని మఱియును బహుభంగుల వినుతింప సుగ్రీవునిఁ గ్రుచ్చి యాలింగనంబు గావించి యతండును దానును విభీషణుండును లక్ష్మణుండును సుమంతుండును వసిష్ఠుండును వానరబలావలోకనాభిలాషులై భేరీమృదంగవైణిక కాహళ పణవ ఢక్కానేక శంఖ వేణువీణాదినాదంబులు చెలంగ రథంబు లెక్కి వచ్చి దక్షిణగోపురం బెక్కి రప్పుడు. 53

సీ. ఒకకపి నింగికి నుంకించి గిరిపైవ వెగసి యొక్కఁడు దానిఁ బగులఁదన్ను
నొకవానరుఁడు రవి నొడియ లంఘించిన నొక్కఁడు వానిపై నుమిసి నవ్వు
నొకవనచరుఁ డంత నుర్వీజమునుఁ బీక నది పుచ్చుకొనఁ బీఁకులాడు నొకఁడు
ఒకకోఁతి యిగిలించి యొగిఁబండ్లు చూపినఁ గఱచు నొక్కఁడు వానిఁ బఱచు దనుక
తే. నొకఁడు రాఘవ ననుఁ జూడు మొక్కరుండ
శతముఖునిఁ2 ద్రుంతు ననివచ్చుఁ జౌకళించు
దండిగా నేనె యిక్కడనుండివాని
వాలమునఁ దెత్తునని కూయవచ్చు నొకఁడు. 54

సీ. అక్కపిచుబుకదీర్ఘాభీలరోమముల్ నల్లిమీఱఁ గనుపట్టు నాచుగాఁగ
వనచరవారదుర్వారశౌర్యంబులు ఖాతిగాఁ గనరాని లోఁతుగాఁగ
నొగివానరోద్దండహుంకృతిధ్వానముల్ క్రూరాంబుచరమహాఘోషగాఁగఁ
బద్ధాప్తనందనప్రాకటాజ్ఞావిలంఘన మది చెలియలికట్టగాఁగఁ
తే. నగచరులకోపములు బడబాగ్నిగాఁగ, నవ్వు తెలుపది విపులఫేనంబుగాఁగ
భాసురంబగు సకలసేనాసముద్ర, మప్పు డీక్షించె రఘురాముఁ డద్భుతముగ. 55
గీ. తనమనంబున హర్షించి యినజుఁ జూచి, కరుణ మీఱంగ వెండియుఁ గౌగిలించి
మెచ్చి యతనికిఁ దెప్పించియిచ్చె నొక య,3మూల్యమాణిక్యహారంబు మోదముననుఁ.

1 రాజరాజ (రామరమ్యకృపాత్మనే). 2 జంపి యేతెంతు సత్వరమున.
3 మూల్యహారంబు సౌమిత్రి మూలమునను.

గీ. ఇట్లు మన్నించి వెండియు నిసజూఁ గనుచు, నేడి *జ్యోతిర్ముఖుఁడు నీలుఁ డేడి యేఁడి
కుముదుఁ డాగవయుఁ డేఁడి కమలమిత్రపుత్ర వేశ్వర నెఱుఁగింపు చిత్రముగను.

వ. అనిన నొయ్యనఁ దనకేల నమ్మహీపాలతనయునకుఁ గపులం జూపి సుగ్రీవుం డిట్లనియె. 58

క. బహుకపిబలములు చుట్టను, రహిమీఱఁగఁ దన్నుఁ గొలువ రాఘవ మిమ్మే
విహితముగఁ జూచుచుండెడు, మహనీయబలుండు గంధమాదనుఁ డధిపా. 59

క. తరుచరులు గంతులిడఁగా, మురియుచు వాలంబు శీరమూగఁ జేసి మహా
గిరిబోలి చలనమొందెడు, గురుతరదోర్బలుఁడు వాఁడె గోముఖుఁడు నృపా. 60

క. ఆర్చుచు గపులాహవములఁ, బేర్చుచు నభ్రములు ముట్టఁ బెరుఁగుచుఁ గొలువం
గార్చిచ్చువోలె నడుమన, గూర్చుండినవాఁడు దేవ కుముదుఁడు సుమ్మీ. 61

క. భీమారిశుష్కతరువన, ధూమధ్వజులద్రిచరపతులు దనుఁ గొలువం
బ్రేమను నున్నాఁ డురుసం, గ్రామధురంధరుఁడు వాఁడు గవయుఁడు నాథా. 62

క. భూతలము వణఁక తన యడి, చేత గిరిప్రయము నేర్పు చే నునిచి రణ
ఖ్యాతిఁ వహించెను గణఁకక, జ్యోతిర్ముఖుఁ డల్లవాఁడె చూడుము రమణా. 63

క. [1]వాలము రవిఁ గదియఁగ నా, భీలంబుగఁ జూఁచి కపుల భేద్యులు గొలువన్
ఆలంబున కట్ట్రాడెడు, నీలునిఁ గనుగొంటె సకల నృపలోకమణీ. 64

క. తనసాహసంబు గనఁబడ, ఘనసాలయుగంబు చేతఁ గదియించి శతా
స్యునిఁ జంపఁ బూని నిలిచెం, బనసుం డదె చూడు ధరణిపాలవరేణ్యా. 65

గీ. విపులదోర్బలశౌర్యులు కపులు గడిసి, నేల యీనినవిధమున నిండి కొలువ
[2]నాలమునకుఁ జివాలునవ్వ్రాల దొడఁగె, నాగవాత్మునిఁ జూచితే యసురదమన. 66

గీ. ఎపుడు సంగరమబ్బు నాకెపుడు బాహు, దండకండూతిమాను సద్ఘంద[3]భంజ
నమున నెప్పుడు రిపుదళనం బొనర్తు, ననుచుఁ బల్కెడువాఁడు గజాఖ్యుఁ డధిప.

---

*ఏఁడి జ్యోతిర్ముఖుం డనువాఁడు నీలుఁ డేఁడి కుముదుఁడు గవయాదులేరి వేగఁ దమ్మి బాంధవతనయ నేనమ్మఁ జెపుమ. గీ. గంధమాదనశరభులు గజముఖుండు, ఋషభమైందులు ద్వివిదుండు ఝుషముఖుండు, కిలుఁడు నలుండు పనసుండు నీలగళుని, పింగళాక్షులఁ జూపు సుప్రీతి మాకు.

1 గాలంబునఁ జక్కాడెడు. 2 నాహవమునకు మఱియు నట్టాడఁ దొడఁగె. 3 గతుల నెపుడ రిపుసంఘవిదళనం బేనొనర్తు.

గీ. మును పెఱుంగవె పింగళాక్షుని నిమేష
మాత్రమునఁ గూల్చె నప్రతిమానబలుఁడు
కడఁక మిముఁ జూచి దండంబు లిడఁగ జొచ్చె
శరభుఁ డదె చూడు రఘురామ సార్వభౌమ. 68

గీ. వితతముగఁ గపు లేనూఱు వేలు బలిసి, జతనమునఁ గొల్వ హేమాద్రిచందమునను
మదినిఁ బొదలుచు నున్నాఁడు మానవేంద్ర, శతబలినిఁ జూడు మద్దివృక్షంబుక్రింద.

గీ. ఒక్కరుండనె శతముఖు నుక్కణంచి, రామభద్రుని మెప్పింతు రణములోన
ననుచు నాభీలవాల మల్లార్పఁ దొడఁగె, వాఁడె వృషభుండు చూచితె పరగుణాఢ్య.

గీ. సకల సేనానుమేతుఁడై సమరవిజయ,శాలి యగువాఁడు శతకంఠుఁ జంప నేనె
చాలు ననుచును నుత్సాహశక్తి దనరఁ, గాంచు నాపింగళాక్షమర్కటుని గనవె. 71

వ. అని మఱియును సుగ్రీవుం డందఱ వేర్వేర నెఱిఁగింపుచునుండ రామచంద్రునిచరణా
రవిందసందర్శనకుతూహలాయత్తచిత్తులై తమ తమబలంబులతో నిలిచి రాసమయం
బున. 72

శా. అభ్రశ్యామసమానదేహుఁడు సముద్యత్కుందమందారవ
చ్ఛుభ్రాస్యోగ్రుఁడు విక్రమప్రకటరక్షోగర్వవిచ్ఛేదనో
గ్రభ్రూమండలుఁ డాహవాహితభుజాగర్వప్రహారాతిశౌ
ర్యభ్రాజిష్ణుఁడు జాంబవంతుఁ డట మోదాత్ముండు వచ్చె న్వెసన్. 73

శా. భూషాలంకరణస్ఫుటాంగుఁడు దయాంభోరాశివట్ఛాస్త్రవై
శేష్యార్థజ్ఞుఁడు శత్రుదానవమహాజీమూతవాతూలుఁడా
యుష్యశ్రీహసితాబ్జసంభవుఁడు శౌర్యోగ్రుండు రామాయణ
ప్రేష్యాత్ముండు మరుత్సుతుండు తగనర్థి న్వచ్చెనచ్చోటికిన్. 74

శా. చండార్కప్రతిమానతేజుఁడు మహోత్సాహుండు యుద్ధక్రియా
పాండిత్యుం డసమానవిక్రముఁడు శుంభద్వాలగండూషితా
ఖండాకాశవిదుంతుదుండు ప్రతిపక్షప్రాకటోద్యద్భుజా
దండచ్ఛేదనసత్త్వుఁ డాగవయుఁ డంత న్వచ్చె మోదాత్ముఁడై. 75

శా. ధూర్తారాతివిశాలశుష్కవనవాతూలప్రయుక్తోగ్రసం వ
ర్తాభీలదవానలుండు గిరిరాడ్వక్షుండు [1]రక్షోనిశా

---

1 భూరిచ్ఛటా మార్తాండుఁడు రణార్థి.

మార్తాండుండు ఘనుండు నీలుఁ డటఁ బ్రేమ న్వచ్చె నందందనో
యార్తత్రాణపరాయణా రఘుపతీ యంచు న్మహోత్సాహుఁడై. 76

శా. ఉద్యత్సత్వతృణీ[1]కృతాభీసమరస్థోగ్రాసురుం డుజ్జ్వల
ద్విద్యుత్సన్నిభలోచనుండు త్రిజగద్విఖ్యాతశీలుండు దో
స్సద్యస్సంజనితప్రతాపుఁడు శతాస్యచ్ఛేదనాభీలయు
ద్ధోద్యోగంబునవచ్చె మైందుఁడుముదం బొప్పన్ దొరల్ మెచ్చఁగన్. 77

శా. గంధర్వామరకిన్నరాదు లితఁ డుద్గాఢాహవోద్యద్గదా
సంధానప్రబలప్రవీణుఁ డని యిచ్చన్ మెచ్చ నుప్పొంగి గ
ర్వాంధుండై శతకంఠుఁ జంపుటకు రౌద్రావేశుడైవచ్చె స
ద్గంధాంగుం డగుగంధమాదనుఁడు వేగన్ రాఘవుం జూడఁగన్. 78

శా. వత్సా రమ్మని నన్నుఁ బిల్చి త్రిజగద్వైకల్యు నారాక్షసున్
మాత్సర్యంబునఁ గూల్చిరమ్మను నొకో మానాథుఁ డట్లైన నే
నుత్సాహంబునఁబోయి మెల్లనశతాస్యుం జంపినొప్పింతుఁగా
హృత్సాకల్యత నంచు వచ్చెనటకున్ హేలిన్ సుషేణుం డొగిన్. 79

వ. మఱియు నదియఁనుంగాక పేరెన్నికైన మహావానరులచటికి నరుదెంచినం గాంచి హర్షించి రాఘవుండును వారివారికిం దగుతెఱంగుల భూషణంబులును గట్నంబులును దోరహత్తుగా నిచ్చి హనుమజ్జాంబవదాదులఁ గరుణాసముద్రంబులనోలలాడించి బహువిధంబులమన్నించి బలంబుల నొక్కరమ్యస్థలంబున విడియనియమించి సుగ్రీవాంగదుల సాకేతనగరంబుననుంచె రాక్షసవానరబలంబులును రామునకు దేవతలొసంగిన వరంబునం జేసి తృష్ణాశనంబులవలన నిరపేక్షులై యుండిరి అంత భరతశత్రుఘ్నులం గొలిచి కాంభోజదేశాధీశుం డగునీలుండును యవనపతియగువృషభుండును సౌరాష్ట్రనాయకుఁ డగుసంవరణుండును బర్బరనాథుం డగుప్రదీప్తుండును కాశ్మీరరమణుం డగుభరతుండును మలయాళభర్త యగు త్రిభంగుండును నిషధాధీశ్వరుం డగుభీముండును, పాంచాలవరుం డగునీలకేశుండును విదర్భపాలుఁ డగుస్మితాస్యుండును ద్రవిడభర్తయగు సుధేష్ణుండును గౌళ కర్ణాట పుళింద లాట మరాట కొంకణ డేంకణ మత్స్య గాంధారరాజులును జతురంగబలంబులు గొలువ ద్వాదశాక్షౌహిణులతోడ నయోధ్యానగరంబు . సినవారిని వేర్వేఱ నాదరించి తగినవిడుదుల నుండఁబంచి తానును మఱునాఁడు విద్వత్కవివసిష్ఠ సకలపురోహితభూసురానేకాశీర్వాదంబు

1 కృతాసురభటవ్యూహుండు నిత్యోజ్జ్వల.

తెనంగ నుత్సవంబంది సూర్యసిద్ధాంతులచే శుభముహూర్తంబు దెలిసి భేరీమృదంగ ఢక్కాపణవశంఖాదినినాదంబులు ఘోరరవఁ గలుగ భరతాదిసోదరులును కుశలవాది పుత్రులును, విజయాదిపౌత్రులును సుమంత్రాదిమంత్రులును విభీషణాదిరాక్షసులును, హనుమత్సుగ్రీవజాంబవదాదివానరభల్లూకప్రభువులును గొలువ సకలమనుజదనుజవనచరసేనామధ్యంబున కరుగుదెంచి, అఖిలశాఖామృగంబుల రావించి అయిదేసి వెల్వలకు నొక్కొక్కరాజు నేర్పరించి నిలుపవలెనని కుముద గవాక్ష నీల గవయ గంధమాదన గోముఖ జ్యోతిర్ముఖ మైంద ద్వివిద పనస ఋషభ శరభ నల గజ కేసరులను ముఖ్యవానరులకుఁ బదునేగురికిఁ బట్టంబులుగట్టి వారికెల్ల యుద్ధసమయంబు దెలుప జాంబవంతుని నియోగించి యిందఱుఁ గాపాడుమని హనుమంతునిం బ్రతిష్ఠించి అమ్మహాసేనకు దండనాయకునిగా సుగ్రీవు నభిషిక్తుంజేసి పట్టంబుగట్టి యువరాజపట్టంబున కంగదుం బాటించి, అందఱు నొక్కపోఁజుగాఁజేసి అమ్మహావ్యూహంబునకుఁ జుట్టును రాక్షసద్వాదశాక్షౌహిణుల నుండ నాజ్ఞాపించి సకలదేశాధిపచమూసముదయంబు నవలోకించి తద్బలంబు మూఁడుమొనలుగా నేర్పరించి యమ్ముమ్మొనలకు భరతశత్రుఘ్నలక్ష్మణుల నధిపతులుగా సమకట్టి వారికి బాసటగాఁ బుత్రపౌత్రాదుల నిలిపి వారికిఁదోడుగా నుత్తమతురంగసహస్రంబుల నేర్చి వానికిం బ్రాపుగా గంధదంతావళంబులం గోటగాబూన్చి వానికి సహాయంబుగా రథసముదయంబును నిలిపి వానికిం గావలిగా భటసముదయంబుల నియమించి వారలు వ్యథాధీనంబుగా నుండ దేవతల బ్రార్థించి మఱియును. 80

క. మానవవానరదానవ, [1]సేనల నడిపింపనానుషేణునిఁ దేజో
భానుని ధైర్యస్థైర్యుని, ధానుని రావించి యతనిఁ దగ మన్నించెన్. 81

క. మన్నించి రాఘవేశ్వరుఁ, డన్నిదళంబులకుఁ దత్తదధినాథులకున్
ఎన్నఁ బలిత్వము మీఱఁగఁ, బన్నుగ నుర లలరఁ బట్టభద్రుం డయ్యెన్. 82

క. అప్పుడు సంతోషంబునఁ, గుప్పలు గొనగ సుమవృష్టి గురిసిరి సురలుం
జప్పుడుగ మొఱసె భేరులు, కప్పక కాహళులు శంఖతతులును మ్రోసెన్. 83

*సీ. అమ్మహారవముచే నాకాశ మల్లాడె బ్రహ్మాండ మటుపటుపటనఁ బగిలె
నమ్మహాభరమున కహిరాజు నొవ్వక తలవంచుకొనె రసాతలమునందు

1. సేనలకున్ సుషేణు క్షేమంబున సుస్థానంబున సారథిగాఁ బూనిక మన్నించి నిఖిలపూజ్యునిఁ జేసెన్.

*సీ. అమ్మహాబలముల కదలె బ్రహ్మాండంబు తారలు డుల్లె విధాత వణఁకె

నమ్మహాభీషణం బరసి మైసగముగా శివుఁడును జాలిఁ గృశింపఁ దొడఁగె
నమ్మహాధాటికి నఖిలదిగ్గజములు మొనదప్పి యొక్కొక్కమూలడాఁగెఁ
గీ. గాల మరయుచు నుండెఁ బంకజభవుండు, తలఁకి యప్పుడుమృత్యువు తల్లడిల్లె
వారినిధులెల్లఁ బిండలివండులయ్యె, నస్తగిరిశృంగమున వ్రాలె నంత నినుఁడు. 84

సీ. శ్రీజానకీనాథ శిష్టప్రతీపాల కరుణాకటాక్షవీక్షణ పరాకు
సకలలోకారాధ్య శాశ్వత సర్వజ్ఞ కలుషఘ్నవీరరాఘవ పరాకు
దైత్యసంహార సుందరదేహ భక్తమందార తాటకవిధూనన పరాకు
గాధేయనందన క్రతురక్షణాహల్యా శాపవిమోచన జయపరాకు
గీ. అనుచు బలములు చెలరేఁగి యెనసి గంతు
లిడుచు శతకంఠపురమున కెపుసు నడతు
మనుచు నుత్సాహమును బొంది యాత్మలోనఁ
జెలఁగియున్నట్టి యాబలసేనఁ జూచి. 85

సీ. ఉర్వీశ్వరుఁడును గాలోచితకృత్యముల్ సలిపి సంగరమహోత్సాహమునను
బంతంబుతో జాంబవంతుని రప్పించి యాపెద్దవలనఁ బ్రతాపలంక
కరిగెడుమార్గంబు నమ్మార్గమునఁగల మహిమంబులును హనుమంతుతెఱఁగు
నతనిలావునఁ జతురబ్ధిలంఘన మొనరింపవచ్చుటయును సొంపుమీఱఁ
గీ. దెలిసి యమ్మహామహుఁవిడివికినిబనిచి, దమరు నంతట సీతాగృహమున కేగి
యచటఁ దమ్ములు దానును నారగించి, విడియములుచేసి యసదృశవిభవములను. 86
వ. తదనంతరంబ తమగురుం డగువసిష్ఠుని రావించి అతండును తానును సహోదరులును బుత్రపౌత్రులును సీతయుంగూడి శతకంఠుని దృణీకరించు వనచరవ్యూహ మహిమంబులును సామగ్రియును రాక్షసబలపరాక్రమంబులును చప్పన్న దేశాధీశులగువారి ప్రతాపంబులును వక్కాణించుచుండ నాసమయంబున సీతామహాదేవి

---

నమ్మహాభరమున కహిరాజు నొవ్వక తలవంచుకొనె రసాతలమునందు
నమ్మహాభీషణం బరసి సాంబశివుండు రజతాద్రిగుహనగహ్వరము నడాగె
నమ్మహాధాటికి నఖిలదిగ్గజములు మొదటికి నొక్కొక్కమూల నడాగె
గీ. యముఁడును వణంకెఁ బ్రళయకాలాగ్ని యడఁగె
దూనె మృత్యువు వారిధుల్ ధూళిఁ గలసెఁ
బిఱుగులు దొరంగె నచలముల్ భీతి నొందె
వింతలు చెలంగె నాబలువీటి నంత.

తనజీవితేశ్వరుం డగురఘునాయకుని బలుకులఁ గరుణారసంబు చిలుకఁ గడకంట
నవలోకించి మృదుమధురవచనంబుల మెల్లన నిట్లనియె. 87

సీ. ప్రాణవల్లభ మున్నుఁ బంక్తికంధరుతోడఁ బోరునప్పటి భవద్భూరిబాహు
బలపరాక్రమములు[1]బాణసంధానచాతురియును దదుపసంహారణములును
రథగతిక్రమము సారథిచమత్కృతియును నుత్తరప్రత్యుత్తరోన్నతియును
గడుచిత్రమని చెప్పఁగావిని నేనాఁటఁగోలె మీరుయుద్ధంబు సలుపునపుడు

గీ. చూడఁగాఁ గోరి మఱిలోకరక్షోగణేంద్రుఁ
డెప్పుడుదయించునో యని యెదురుచూతుఁ
గామ్య మెల్లను ఫలియింపఁగలిగె నేఁడు
[2]మీజయముఁ గాంతు నను గొని యాజికరుగు. 88

ఉ. పూని శతాస్యుఁడున్ యమునిపోలిక మీరును సంగరంబులో
నేన్గుతోడ నేనుఁగు మృగేంద్రముతోడ మృగేంద్రమున్ దవా
గ్రానలమున్ దవానలము నద్రియు నద్రియుఁడాయు కైవడిన్
సేనలతోడఁ బోరెడివిశేషము చూచెదఁ జిత్తగింపవే. 89

చ. అనవరతంబు శోభనగృహంబునకున్ మఖ మాచరించుతా
పునకును సద్వ్రతంబులను బొందుగఁ జల్పెడిసీమకున్ శ్రుతుల్
వినఁ జనుచోటికిన్ సకలవిశ్వభయప్రదయుద్ధభూమికిన్
వనితలతోడఁగూడి చనవచ్చునె యెఱుంగవె ప్రాణనాయకా. 90

చ. అన విని రాఘవుండు హృదయంబున నద్భుతమంది యంది యీ
వనజదళాక్షి కీకలహవాంఛజనించుట కేమిహేతువో
వినుమని యెన్నఁ డిట్టి యవివేకపుయాత్రకు సమ్మతింప ?
ట్లనుకొన నేల దైవకృతమంతయు దప్పునె యెన్నిభంగులన్. 91

వ. అని యిట్లు డోలాయమానమానసుండై నిజాంగనం గాంచి తదీయశరీరసంజనిత తేజోవిశేషంబు మధ్యాహ్న మార్తాండ మండలంబును ధిక్కరించి సకలబ్రహ్మాండంబులు పిక్కటిల్లఁ దనకన్నుఁ గవకు మిఱుమిట్లు గొలుపఁ దలయూఁచి యిట్టి సహాయంబున శతకంఠునిఁ దృణలీల సాధింపవచ్చునని వెండియు జానకి నిజాకారంబు వీక్షించి లోకంబులఁగలుగు రాజకుమారికాజనంబుల యట్లు భావించుచు

1 బాణసంధానంబుఁ జాతుర్యముఁ దదుపసంహరణము. 2 విజయమును గాంతు నను గొని వెడలు మనికి.

మనుజవేషుండు గావున నమ్మహామహిమావిశేషంబులు తెలియ నలవిగాక భరత
శత్రుఘ్నలక్ష్మణులమొగంబులుచూచి వారును వసిష్ఠుండును వినుచుండ సీతామహా
దేవి కిట్లనియె. 92

సీ. చిలుకపల్కులవిని యలుకఁ గోమలివి దుర్విమతార్భటంబులు వినఁగఁ గలవె
ఎదు రెవ్వరాడిన మదిఁ గుందు సుగుణవు ప్రత్యర్థిభావలు పడఁగఁ గలవె
వెన్నెలకాకకు వెఱచెడి యబల వత్యుగ్రబాణాగ్నికి నోర్వఁగలవె
స్ఫటికంపుసోపానపంక్తుల నొంటిమై నిలలేవు రథముపై నిలువఁగలవె
గీ. ఏల పలికితి వీబుద్ధి యెట్లుపుట్టెఁ, గలహగతు లేద నీవేద గమనమేడ
శతముఖునిఁ జంపి వానిదేశమునఁ గలుగు, వస్తువులు నీకుఁ గొనితెత్తు వలవ దుడుగు.
సీ. ఆరూఢమధురవీణారవంబులు గావు ప్రతిభటాభీలహుంకృతులు గాని
కళ్యాణసమయసత్కాంతావ్రజము గాదు భయదరాక్షసకదంబములు గాని
కోలఁది వాసించు కుంకుమగంధమది గాదు మఱి రక్తజంబాలమయము గాని
పర్యంకమల్లికాప్రసవమార్గము గాదు [1]చండభల్లప్రపంచంబు గాని
గీ. తలఁప సుఖకేళి గాదు యుద్ధంబు గాని, ముద్దియాటలు గావు ఘనమృత్యుముఖము గాని
నాతి ముచ్చిట్లు చని మోసపోకె గాదె, రాక కూడదు వికచనాళీకనయన. 94
సీ. నావిని తనమాట నాథుఁ డనుగ్రహించుటయు లేకున్న నించుక తలంకి
బాష్పారుణితనేత్రపద్మయై మో మఱవాంచి యడ్డున నేల వ్రాసికొనుచుఁ
బతిమోముచూచుచుఁ బటుకుచోపరిదివ్యచేలాంచలము గండసీమ నొత్తి
పలుకుదునో యని పలికినఁ దా మళ్ళి పలుకునో పలకఁడో యలుక ననుచుఁ
గీ. భయము భక్తియు నుద్దండఖండనప్రయాణవాంఛయుఁ దనహృదయమునఁ బెనఁగ
నావసిష్ఠుండు మఱఁదులు నతిముదమున, వినఁగఁ గ్రమ్మఱఁ బల్కె నవ్విభునితోడ.
గీ. ధరణినాయక వినవయ్య తావకీయ, మహితభుజపర్వతంబులమఱువునందు
నిలిచి చూచెదఁ బోరు మీనేర్పు నేను, సమరయాత్రకు భంగంబు సలుపఁదగునె.
వ. అని మఱియు ననేకప్రకారంబుల జనవరునిమనసు రంజిల్లంజేసి పదంబులం బడిన
లేవనెత్తి రఘువరుండు నిజగురుముఖావలోకనంబు గావించి యిందు కెయ్యది
తెఱంగన్నఁ దత్సకలవిద్యాగరిష్ఠుం డగు వసిష్ఠుండు నిజతపోమహిమంబువలన భూత
భవిష్యద్వర్తమానప్రవర్తనంబుల తెఱంగు లెఱుంగుం గావున జానకీప్రభావంబు
దెలిసి యమ్మహాశక్తివలన శతకంఠునిమరణంబును రామునివిజయంబును నిశ్చయంబు
చేసి యేకాంతంబున నిట్లనియె, 97

---

1 సమరభల్లప్రచండములు గాని.

గీ. రామ మీరామగోరెడి రాక కనుమ, తెంచి చనుమా వధూటి యేతెంచినపుడె
యమ్మహామూర్తివలన శతాస్యుఁ డీల్గు, జయము చేకూఱు మీకును సత్యముగను.
మ. అదియెట్లన్నఁ దదీయదైత్యవరుఁ డాయాబ్జాసనుం గూర్చి సొం
పొదవన్ ఘోరతపంబుచేసి మఱిబా గొప్పంగ మెప్పించి సా
వరదా శాంతవిచార నాకుఁ బురుషప్రాయంబుచేఁ జావులే
నదిసత్యంబుగని మ్మటంచును వరం బాఖీలతం గైకొనెన్. 99
ఉ. కానన భేద్యుఁడైన శతకంఠుఁడు జానకిచే నణంగునే
గాని మఱొండుశౌర్యులను గైకొనఁ డంగనచేతఁ జచ్చుటల్
మానవనాథ సిద్ధమది మావచనంబులు కల్లగావు సు
మ్మానలినాక్షిఁ దోడుకొని యాహవభూమికిఁ బోవు టొప్పగున్. 100
సీ. *ఏతల్లి దాసదాసీతతుల్ బ్రహ్మసదాశివవిష్ణులుఁ దత్సుతులును
పరఁగ సేవనిత నివాళిపళ్లెరములు బంధురకైరవపద్మహితులు
ఏయమ్మబోనపు టెండ్లనఁ జెలువొందుఁ దలపోయఁగా సప్తజలనిధులును
ఏమహాశక్తికి నెల్లబ్రహ్మాండంబు లనవరతంబును నాటపట్టు
గీ. లానర నేసతి యూర్పుల నుదయమైరి, మూఁడుమూర్తులు నీజగన్మూల మెద్ది
యప్పరంజ్యోతి సీతగా నాత్మఁదలఁపు, కేవలాంగనగాఁ జూడ కీవు నృపతి. 101
వ. ఈపరమరహస్యంబు బాహ్యంబుగాకుండ నీచిత్తమందు నునిచి సీతాసమేతుండవై
యుద్ధంబున కరిగి శతకంఠునిం బరిమార్చి గొబ్బున మరలి రమ్మని యాశీర్వదించి
వెండియు వసిష్ఠుం డిట్లనియె. 102
గీ. అంత ఫల్గుని యెల్లి దినాంతమైనఁ, గమలమిత్రుఁడు గగనమధ్యమున గదియఁ
జైత్రయాత్రకు నప్పుడే చనఁగవలయు, మనసు రంజిల్ల నేగుమీ జనవరేణ్య. 103
గీ. ఆర్తరక్షక యిట్టిమాహార్తమందు, గదలి శతకంఠుఁ బరిమార్పుకదనమునను
అస్త్రశస్త్రాధిపతుల నీయాత్మఁ దలఁపు, నేననెల్లను బురికొల్పుమాన వేంద్ర. 104
వ. అనిన విని రామచంద్రుండును సాంద్రతరాశ్చర్యమానసుండై జానకీప్రయాణంబు
నకు సమ్మతించి సంభ్రమింపుచు నుండె వసిష్ఠుండును గృహంబున కరిగెఁ దమ్ము

*సీ. ఏదేవదేవికి నేదేవదేవాది దేవతల్ దాసులు దివ్యకీర్తి
యేకాంత కేకాంతి కేకాన్త వేదాంత తత్త్వరహస్యంబు దనరఁ గలుగు
నేకొమ్మ కేకాక్ష రేక్షరక్షోరూప రూపపంచాక్షరిరూఢి నెసఁగు
నేశక్తి కాసక్తి నీయబ్జభాండంబు నాటపట్టైయుండు నఖిలమునకు.

లును మిత్రులును దమతమవిడుదులకుం జనిరి రఘునాయకుండును సుఖనిద్రం జెం
దెనంత *నుషఃకాలంబున మంగళపాఠకు లరుదెంచి వీణానాదంబుల నింపుసొం
పుగా భూపాల దేశాక్షి దేవగాంధారి మలహరి నారాయణి వసంతాదిరాగంబుల
ననురాగంబుగావించి వానిమిత్రంబులు నయనంబులును కాలంబులును లఘుముఖ
డోలాదివితానంబులును ఉదుర సౌరవ రవంబులును మధుర మందర మధ్యమతార
కంబులును రాయిస్థాయిరవంబులును సరిగమపధనిసాది కళికోత్కళిక జంపె మట్టివ
అటతాళ ఏకతాళ త్రిపుట రూపక ముఖానేకతాళంబులును దెల్పి యుల్లనిరి. 105

సీ. సమరగుణోత్సాహ జయగుణసందోహ మేఘకోమలదేహ మేలుకొనుము
మునిజనవనచైత్ర వనరుహదళనేత్ర మిత్రవంశపవిత్ర మేలుకొనుము
దళితశంకరచాప కలితజయాటోప మృదుభాషణకలాప మేలుకొనుము
వితతశుభాచార విమతరాడ్గజవార మృగనాయకకిశోర మేలుకొనుము
గీ. †అనుచు రావణకుంభకర్ణాదిదైత్య, సంహృతి స్తవగీతముల్ సలుప నలరి
భానువంశుండు తనముఖపద్మ మలర, మేలుదేరంగ నొయ్యన మేలుకొనియె. 106

శా. ఈరీతిం దగమేలుకాంచి వసుధాధీశుండు కాలోచితా
చారంబుల్ గడతేర్చి భూసురనమస్కారంబులుం జేసి త
త్కారుణ్యంబున దీవనల్ గొనుచు సంగ్రామప్రయత్నంబునన్
భూరిప్రస్ఫుటసత్కిరీట మచటం బూనె న్ముదం బొప్పఁగన్. 107

క. అన్నరవరునిశిరంబునఁ జెన్నలరెఁ గిరీట మపుడు [1]జిగిమించుచుశుం

---

సీ. *ఉదయకాలంబున ముదమొప్ప మంగళపాఠకు లరుదెంచి భక్తిమీఱ
వేణువీణానాదవిమలస్వరంబులు గాంధారిమళహరిగౌళనాట
భూపాళసురటి కాంభోదినారాయణి మొదలైనరాగముల్ ముద మెలర్ప
వానిమిత్రంబులు వరుసనునయనముల్ కాలంబులఘువులు కడు ముదమున
గీ. ముఖ్యడోలావితానముల్ సఖ్య మలర, యారు దశరవసంపూర్ణయనముదాత్త
స్వరితప్రత్యయమందంత సరణి మధ్య,మమును సరిగమపధనిసామగరిగరిస
జంపె మటిమయు నటతాళి మింపుమీఱ, త్రిపుట యెకతాళి రూపవిస్తీర్ణములను.
క. ఈరీతిని సంగీతము, నేరుపుగాఁ బాడి మిగుల నేర్పులుగలుగన్
శ్రీరాముని మదిఁ దలఁచుచు, హేరాళముగాను సంహితేంద్రులు వినఁగన్.
†అనుచు శ్రీరఘురాముపాదాంబుజములు, మదిని తలఁచుచు గీతము ల్మోద మెసంగఁ
బాడి రంతట రఘుముఖపద్మ మలర, మేలుదెలిఁగుల......

1 జిగిమించుచుఁ బూ ర్వోన్నతగిరిశిఖరంబున.

ఘనస్నిలశైలశిఖిరిని, సన్నిహితమహార్కుఁబోలెఁ జర్చిఁపంగన్. 108

వ. *అదియునుగాక మఱియు ననేకచిత్రమణిభూషణపరంపరలు దివ్యాంబరంబులు ధరియించినం గనుంగొని సీతామహాదేవి తనపతివ్రతాధర్మంబె భూషణంబుగాని కొండొకయలంకారంబులు గలవే యని సమరప్రయాణప్రయత్నంబున నుండె నంత. I09

గీ. దేవభూదేవతతులు నుతింప యాత్ర, కావసిష్ఠుండు నిది సమయం బనంగ
బరఁగ రాక్షసలోకగర్భములు వగుల, నపుడు చఱపించె జైత్రప్రయాణభేరి. 110

మహాస్రగ్ధర. అదరెన్ బ్రహ్మాండభాండం బరుదుగఁ జలనం బందె సప్తాంబురాసుల్
చెదరె న్నక్షత్రపంక్తుల్ జిగిబిగిఁ బరమేష్ఠి న్భయం బందె నాత్మన్
బెదరెన్ దిగ్దానదంతుల్ బిఱబిఱఁ దిరిగెన్ భీషణంబై కులాద్రుల్
వదలెం గాలుండు జీవవ్రజములఁ గెడపన్ భాండమై భేరి మ్రోవన్. 111

క. తదనంతరమున రాఘవుఁ, డొదవిన మోదమున శుభముహూర్తముతోడన్
సుదతియుఁ దానును గడు నె, మ్మదిఁ జేసెను దల్లులకు నమస్కారణంబుల్. 112

క. చేసినఁ గొడుకును గోడలిఁ, గోసలరాజేంద్రతనయకుశలత మెఱయన్
భాసిల్లుచు దీవింపఁగ, నాసుదతుల పీడ కొని రయంబున వెడలెన్. 113

క. భరతశత్రుఘ్నలక్ష్మణు, లరుదుగ దీపింప వెడలి రగ్రజుతోడం
గరమొప్పఁ బుత్రపౌత్రులు, నరిగిరి రయమునఁ గనత్సురాధిపు లలరన్. 114

వ. ఇవ్విధంబునఁ బుత్రపౌత్రనిచయంబును సకలబంధునివహంబును దనతోడ నడువ నంతఃపురంబుదాఁ నభిజిన్ముహూర్తంబున వెడలి సుమంత్రాదిమంత్రుల నయోధ్యాపురి పరిపాలనంబునకు నియోగించి పురమధ్యంబునం జనుమయంబున 115

---

* ఉ. అదియునుగాకయున్న తగినట్టి విచిత్రసువర్ణకాంతి యిం
పొదవి విహారయారమణి భూషణముల్ ధరియించియున్న స
మ్మదమునఁ జూని సీత తనమానసమందుఁ బతివ్రతాగుణా
స్పదమని వేసె భూషణముఁ బట్టఁ బనేమి యటంచు నుండఁగన్.

వ. అత్యంత మనోత్సాహంబున రణప్రయాణంబునకు నుండె నంత.

. సురలు భూసురు లత్యంతజృంభణమున
[illegible]తిస్సేయంగ నావసిష్ఠునిమతమున
[illegible]యు మిదియని సకలసంభ్రమము లలర.

సీ. శ్రీరస్తు భూపాలశేఖరా! యని సర్వగీర్వాణజనము లాశీర్వదింప
శుభమస్తు సౌజన్యచూడామణి యటంచు విప్రవర్గములు దీవించుచుండ
నెలమి సమస్తగ్రహైకాదశస్థానఫలము ప్రస్తుతించు జ్యోతిషులు చెలంగ
[1]నభ్యుదయపరంపరాభివృద్ధిగఁ గవీశ్వరులు కవిత్వలక్షణముఁ దెలుపఁ
తే. గాంతలభ్రంకషోజ్జ్వలకలితభవ్యహర్మ్యసమాగ్రముల నెక్కి యలరుకొనుచు
నగుచు దూర్వాక్షతప్రసూనములుచల్లఁ, బూర్ణకుంభస్వయంబును బొడఁగనుచును.

వ. ఇట్లరిగి. 117

ఉ. హాటకకేతనంబులు జయప్రదహోదరరత్నచక్రముల్
కోటిమహోగ్రఘంటికలు ఘోరశరాసనబాణతూణముల్
పాటవమైనసారథియుఁ బ్రస్ఫుర వజ్రభయంకరస్ఫుర
త్స్ఫోటసహస్రముం గలయకుంఠితదివ్యరథంబుఁ గన్గొనెన్. 118

చ. కనుఁగొని ఘంటికాపణవకాహళభేరిమృదంగవాద్యముల్
వనధిపరీతభూస్థలి నవక్రత నిండుచు బోరుగొల్పఁగాఁ
దనగురుఁ డావసిష్ఠుఁ డమృతంబున ముస్నె యనుగ్రహింప న
య్యినకులనాథు డెక్కెఁ బ్రమదంతియుఁ దాను సురాలి మెచ్చఁగన్. 119

గీ. రాజపరమేశ్వరుం డైనరాఘవునకు, భూజగన్మాత యైనట్టి భూమిజకును
దగనరుంధతిముద్రాక్షతప్రసూన, మిచ్చి దీవించి చూచెను వచ్చె నపుడు. 120

గీ. రాజదేవేంద్రు డైనట్టి రాఘవునకు, [illegible] జూపట్టె రమణితోడఁ
త్రిపురములుగూల్ప నసదృశతేజమునను, గౌరితోఁగూడి చనెడి శ్రీకంఠు డనఁగ.

వ. ఆసమయంబున. 122

శా. మేఘాభాంగుఁడు కార్యవేది [illegible] బుద్ధిక్రియా
శ్లాఘాయుక్తుఁడు సత్కృపాకరుఁడు సౌజన్యాఢ్యుఁ బ్రస్తావభాం
డాఘాతప్రతిమానలీల [illegible]
[illegible] దాశరథి [illegible] ముదం బొప్పఁగన్. 123

శా. [illegible] ప్రతిమానవైన [illegible]
గాత్రుం డాశుగ [illegible] ద్వేషి [illegible]
క్షాత్రప్రాభవ [illegible] సంగ్రామప్రచండుం [illegible]
చ్ఛత్రచ్ఛాయ [illegible] రాముఁ [illegible] గన్. 124

1 విజయోస్తు సకలసద్విభవరాజవి[illegible] యనుచు సత్కవులు స్తుత్యములుచేయ.

మ. పుడమి మిట్టట్టుచలింప దిక్కరిచయంబుల్ మ్రొగ్గ నొక్కుమ్మడిన్
జలధివ్రాతము లింక భీషణధనుర్జ్యాఘోషగావించుచుం
బిడుగుల్ వోలినబాణముల్ గలిగి యాఖీలప్రతాపంబులో
వెడలెన్ లక్ష్మణుఁ డల్లనల్లన సురల్ వేడ్కం దనుంజూడఁగన్. 125

సీ. తమకంఠు లట్టుల తమకంబు శౌర్యంబుఁగలిగి వర్ధిల్లెడిభుజులు వీరు
వాల్మీకి దత్తదుర్వారబాణాక్షయశరధులు గలిగినజయులు వీరు
సీతావధూగర్భసింధుసంభవములై మహిమీఁదఁ గనుపట్టు మణులు వీరు
శతకంఠవరచమూసముదయంబులఁ జంపఁ దొడరినయట్టి మృత్యువులు వీరు
తే. చూడఁడని నిర్జరులు కడుఁజోద్యమంద
దల్లిదండ్రులు ముదమందఁ దాముదంతి
యంగముపైనెక్కి వెడలి రత్యుగ్రు లగుచుఁ
గుశుఁడు లవుఁడును రిపుగజాంకుశము లనఁగ. 126

గీ. తాత రాముండు ముదమందఁ దండ్రి కుశుఁడు
గారవంబున సెలవులఁ బాఱ నవ్వ
డంబుగా నొక్కయుత్తమాశ్వంబు నెక్కి
వెడలె విజయుండు రౌద్రుఁడై మృడునికరణి 127

వ. ఇవ్విధంబున రాజపరమేశ్వరుండును బరమేశ్వరకాంతాస్మరణకారణశరీరప్రకాశుం డును శరీరప్రకాశనిర్జితకోటిసూర్యుండును సూరిజనస్తవభుజపరాక్రమవంతుండును శివసహస్రనామస్తోత్రపరాయణుండును వేదసారోద్ధారతత్త్వజ్ఞుండును నిఖిల వేదాంతతత్త్వరహస్యప్రవర్తమానుండును బ్రభుమంత్రోత్సాహశక్తియుక్తుండును మహోరస్కుండును నగు రామచంద్రుండు సాంద్రకళామహిమంబునఁ బూర్ణిమా చంద్రుని ధిక్కరించుచు సకలసన్నాహంబున బట్టపుటశ్వంబునం గదలునప్పుడు కో మలమేఘంబు నలంగట భాస్వత్తటిల్లతయునుంబోలె జెలంగుచున్న జానకీదేవి నీక్షించి మించిన మోహంబున నప్పురస్త్రీజనంబులు గుంపులుగూడి యొండొరుల మొగంబులు గనుంగొనుచు నిట్లనిరి. 128

గీ. పొలఁతి కుచయుగళంబులతోఁ బోరుటకును
గాదె చక్కని సౌవర్ణకలశతతులు
నొక్కులై చిక్కువడి చాలఁ దుక్కుబట్టి
సుత్తెపెట్లను లోనయ్యెఁ జోద్యముగను. 129

గీ. మధ్యమక్కేసరికిఁ దగుమధ్యమంబు, పిఱుఁదుపులినంబునకు గట్టిబిరుదుచూడఁ
బదములంబుజములకు నాస్పదములగుచు, రామసౌందర్యవిభవాభిరామగాదె. 130

గీ. [1]లోచనభ్రూస్తనద్వయలోలమధ్య, కైతవములు వహించుచుఁ గలితసింహ
కుంభమిథునధనుర్మీనకులము లిపుడు, కన్యయందుండు టాశ్చర్యకరముగాదె. 131

వ. ఇట్లు పురసతులభినుతింప రామభద్రుండు నిర్నిద్రసంభ్రమంబునఁ బ్రొద్దుగ్రుంకునంతకు సాకేతపట్టణప్రాకారద్వారంబులు గడచి కరదీపికాసహస్రంబులతో సకలరాక్షసవనచరమనుజసేనామధ్యంబున కరిగి యచట విభీషణకల్పితంబైన పటకుటీరంబున విడిసె భరతశత్రుఘ్నలక్ష్మణులును కుశలవాదితనయులును విజయాదిపౌత్రులును దనచుట్టును విడిసిరి. వారికిం బ్రాపుగా ద్వాదశాక్షౌహిణులతో దేశాధిపులుండిరి. వారికి రక్షకుండై సుగ్రీవుండు డెబ్బదిరెండువెల్లువలతోఁ బరివేష్టించి యుండె తద్బలంబునకు వలయాకారంబుగా విభీషణుండు తనసేనలతో గాపయ్యె అన్నిబలంబులకు హనుమంతుఁడాదరువై తద్బలంబునకు రసాతలంబును నక్షత్రమండలంబును మట్టనాభీలంబుగా వాలంబు పెంచివాటంబుగాఁ గోటఁజేసి ద్వారప్రదేశంబున మృత్యువుంబోలి కడంగియుండె అఖిలజీవంబులును తమతమమనువులఁ జేరె అవ్వేళ భేరీమృదంగాదితూర్యఘోషంబులును బలసింహనాదంబులును సమస్తహయహేషారవంబులును గంధసింధురబృంహితధ్వానంబులును రథనేమినిష్ఠురస్వనంబులును భల్లూకఘుర్ఘురధ్వనులును కార్ముకగుణటంకారంబులును బుంఖానుపుంఖంబులై యొక్కపెట్టున నఖిలబ్రహ్మాండకోటరంబులు ఘుమఘుమాయమానంబులుగా నిండి విలయకాలంబున బడబానలముఖంబులకు నుఱికి మొఱపెట్టు సప్తార్ణవంబుల ననుకరించె ఆది ప్రళయసమయంబునుంబోలె విభీషణ ప్రగల్భంబై సంగ్రామవర్తనంబునుంబోలె శత్రుఘ్నప్రశస్తంబై నాట్యంబునుంబోలె భరతకలితంబై పవిత్రస్థలంబునుంబోలెఁ గుశాభిరామంబై భారతరణంబునుంబోలె విజయప్రసిద్ధకరంబై సరోవరంబునుంబోలె నీలకుముదసంశోభితంబై శృంగారవనంబునుంబోలెఁ బాటలపనసరంభాలంకారంబై అలకానగరంబునుంబోలె సకలరాజసంచయంబై యుండె నంత. 132

సీ. బలువిడిపద్మముల నలరించుశిసిరుండు మూఁడుమూర్తులకును మూలదుంప
ఘనులచే నర్ఘ్యముల్ గొనెడిమహాత్ముండు నెట్టన దీప్తులపుట్టినిల్లు
ఎన్నంగ సమవర్తిఁ గన్నజగత్కర్త చక్రరక్షణములు సలుపురాజు
సతతప్రసన్నదీక్షాగుణాఢ్యకుండు [2]విప్రనమస్కరణప్రియుండు

1 లోచనద్వయకుచములు లోలమధ్య. 2 భూసురస్తోత్ర సత్పూజితుండు.

గీ. శ్రీరఘూద్వహునిజవంశకారణుండు, భూజనంబుల రక్షించుపుణ్యమూర్తి
నిరుపమధ్వాంతశుష్కవనీదవాగ్ని, యర్కుఁ డుదయించెనరుణసంపర్కుఁ డగుచు.

వ. అంతకుమున్న రాముండు సంధ్యాదిక్రియలు దీర్చి గంధమాల్యాంబరాభరణంబులు ధరించి విభీషణసుగ్రీవాంగద హనుమత్ప్రభృతుల రావించి వారివారికిం దగినకట్నంబులును భూషణంబులును ముదంబున నొసంగి యిగ్గార్గేయముహూర్తంబున సేనల నడువ నియోగింపుండని సుషేణునిం బిలిచి మన్నించి మార్గంబు సూప నియమించి తనతమ్ముల నవలోకించి కుశలవవిజయులను మీరును సకలనృపతులం గదలింపుఁ డనిన నమస్కరించి తమతమబలంబులకుం జాటింప వారును గరవాల ముసల ముద్గర పట్టిస ప్రాస త్రిశూల గదా పరిఘా భిండివాల కఠార కుఠారకతోరధనుర్బాణంబులు గైకొని నీల నల హర సంపాత్యవక్ర వక్రజిహ్వ శూలముఖ రక్తవదన ఏకపాద కుటిలకేశోలూఖ మహోగర్భ వికృతపార్శ్వాదులగు రాక్షసులును గవయ గంధమాదన గోముఖ జ్యోతిర్ముఖ పనస నల నీలాంగద వేగదర్శి గవాక్ష మైంద ద్వివిద జాంబవదాది మహాకపినాయకులును నీల యవన పృథు సంవరణ ప్రదీప్త భరత త్రిభంగ భీమనీలకేశసుధేష్ణ స్మితాస్య ప్రముఖ నిఖిలదేశాధిపతులును గజహయాందోళన స్యందన బృందంబులనెక్కి తమతమవెంట చతురంగబలంబులు గొలువ ఛత్రచామరాది నానాలాంఛనంబులు మెఱయ భేరీమృదంగశంఖపణవాద్యనేకవాద్యంబులు మొరయ నేలయీనిన తెఱంగునభూమియందును వియత్తలంబునందును పర్వతంబులయందును తటాకంబులయందును దిక్కులయందును బట్టుచాలక యెనుబదియోజనంబుల పొడవును నంతియవెడల్పునుగలిగి నిరంతరంబుగా నఖిలబలంబులు నడుపం జొచ్చె భరతశత్రుఘ్నలక్ష్మణకుశలవవిజయాదులను విభీషణసుగ్రీవాంగదులు నఱువదిసహస్రంబులతో రామచంద్రునిఁ బరివేష్టించిరంత. 134

సీ. ముఖమూర్ధ్వలోకాంతమునఁగల యజువక్త్రమున నున్నచెలియతో ముచ్చటాడ
హస్తముల్ ప్రాక్పశ్చిమాచలంబులతోడ నెయ్యంబుమీఱంగ నియ్యమంద
నాభీలవాలాగ్రమా ధ్రువమండలసీమతో నందందచెలిమి సేయ
శాతరోమావళుల్ సరభసలీలనక్షత్రపంక్తులకు బెజ్జములు సేయఁ

గీ. బృథుశరీరంబు జగమునఁ బిక్కటిల్లఁ, దనదురవళికి మృత్యువు దల్లడిల్ల
హుంకరించినఁ గులగిరు లులికిపడఁగఁ, మించి హనుమంతుఁ డప్పు డేతెంచి నిలిచె.

గీ. ఘోరవాలంబు దలపోయ మేరువయ్యె, భూరితారావళులు మొలపూసలయ్యెఁ
గమలినీనాయకుఁడు బొడ్డుగంటయయ్యె, ననుమ రాఘవునకుఁ దోఁచె నట్టివేళ.

గీ. తోఁచినను దనచిత్తము తొంగలింప, గాఢ్పపట్టిన నిండారఁ గౌఁగిలించి
చెలఁగి సేనల నొకదరిచేర్ప నీవె, యనుచు నమ్మినవాఁడ ని న్ననిలతనయ. 137

గీ. అనుచు సీతయుఁ దాను నొయ్యనరథంబుఁ,గరుణ నెక్కనఁ గని తురంగములవిడిచి
దేవతలు పుష్పవర్షముల్ దివిరి కురియ,దనశిరోమధ్యమునఁ దాల్చెఁ దద్రథంబు.

గీ. [1]మఱియుఁ శత్రుఘ్నభరతలక్ష్మణులుఁ గుశల,వాదిపుత్రులుఁ బౌత్రులు నర్కసుతుఁడు
నావిభీషణుఁడును మిత్రు లతనిభుజము,లందు పీపందునుండి రందందనిలిచి. 139

ఉ. దంబుగ సేనలందఱు విడంబముమీఱఁగ రోమరోమ కూ
పంబుల నద్రిఁ జీమగమిప్రాకినజాడ్పున నెక్కి నిక్కుచుం
బంబిన వేడ్క నుండిరి శుభస్ఫుటభాషల సన్నుతించుచున్
అంబరచారులెల్లను జయంబుగ నిచ్చిరి దీవనల్ వెసన్. 140

వ. ఇట్లాఖిలవాలగంభీరదోస్తంభ విజృంభమాణుండై హనుమంతుండు గొని చనిన భేరీ మృదంగ కాహళ కఠోర భూరిభాంకార బధిరీకృతబ్రహ్మాండకోటరుండై రాముండును గ్రహంబులలోనఁ బ్రకాశించు భాస్కరబింబంబునుంబోలె సకలసేనలలోనం దేజరిల్లుచు రవి గ్రుంకునంతకుఁ దమసానదీతీరంబున విడిసి మఱునాఁ డచ్చట వీడ్కొని సుషేణుండు ముందఱ నడవఁ గ్రమక్రమంబున మహావనంబులును దటాకంబులును బర్వతంబులును దేశంబులునుం గడచి త్రిజగద్భయంకరంబుగా క్షీరసముద్రాభిముఖుండై రాఁ దొడంగె. అంత నక్కడఁ బ్రతాపలంకారమణుం డగు శతకంఠుండు సకలపురోహితామాత్యబాంధవరాక్షసలోకంబు బలసియుండ నిఖిలామరదిశారమణసముదయంబు గొలువ నభ్రంకషసింహాసనంబునఁ బేరోలగం బుండుసమయంబున. 141

క. చారులు దిగనర్గళసం, చారులు నిజనాథహితవిచారులు స్వకులా
చారులు రయములు మీఱఁగఁ నారయఁగా నేగుదెంచి రపు డయ్యెడకున్. 142

క. అరుదెంచి రాక్షసేంద్రుని, చరణంబులు గాంచి మ్రొక్కి చయ్యన సుచితం
బెఱిఁగి సభయెల్ల వినఁగను, సరగునఁ దా మిట్టు లనిరి శతముఖుతోడన్. 143

క. అయ్యా మీపంపున మే,మయ్యాతావులకు నేగి యచ్చటివార్తల్
నెయ్యమున నరయుచుండఁగఁ, జయ్యన విపరీత మైనచందము వొడమెన్. 144

క. రావణునిఁ దునిమినట్టి మ, హావీరుం డగణితంబు లగుబలములతో
దేవతలు సంతసిల్లఁగ, మీవలనకు దాడివెడలె మేదిని యదరన్. 145

1 ఈగీతమునకే వేఱొకప్రతిలో వచన మున్నది.

క. మున్నింటికవులఁ జెప్పఁగ, విన్నారము వానికన్న విస్తారముగా
నున్నది బలము లోకండొకఁ, డన్నిజగంబులను మ్రింగు నలిగినఁ గణఁకన్. 146

క. పేరుగొని యిసుకలైనను, దారావళులైన వర్షధారలలైనం
దోరముగ నెన్నఁదగుఁగా, కా రాముని బలములెన్న నలవియె మాకున్. 147

క. అందునఁ బొదలుచు మారుత, నందనుఁ డనువాఁడు మేరునగమునుబోలెన్
సందడిగఁ బెరిగి సేనల, నందఱనెత్తుకొని మృత్యువై యిటవచ్చెన్. 148

క. చెప్పినదేవరమనసున, కిప్పలుకులఁ గోపమొదవు నేమెటులైనం
జెప్పకయుండుట తగ దీఁక, నప్పవనజు నెదురనోప రమరులునైనన్. 149

క. అటువంటివారె మీపై, నిటవచ్చెడి శూరులెల్ల నెవ్వరితోడం
గటకటఁ బోరఁగ దగు మీ, కెటువలె మదిఁదోఁచు నొక్కొ యెఱుఁగము దేవా.

క. ఎవ్వరికిని గనఁబడకయె, యవ్వీరుల నరయుచుండ నపు డొకకపి తాఁ
గ్రొవ్వున నార్చుచు నొకగిరి, జువ్వునఁ గబళించి నిలిచెఁ జూర్ణముగాఁగన్. 151

క. వానికి నిక్కోటులు నీ, దానవులును తృణముగాఁగఁ దలఁచితి మెట్లో
కాని యశక్యపుఁ గార్యము, కానంబడె నది తరింపఁగా నెత్తెఱఁగో. 152

క. ఉగ్రుండై యా సేనకు, సుగ్రీవుం డనెడువాఁడు సొరిదిగ మీతో
విగ్రహముచేయబొదలుచు, నుగ్రునికైవడిఁ బలిత్వమొప్పఁగఁ బూనెన్. 153

ఉ. ఇట్టిబలంబుతోడఁ బరమేశ్వరునైనను ధిక్కరించుచున్
నెట్టన రాఘవుం డనెడు నిష్ఠురవిక్రముఁ డెన్నిరీతులన్
గట్టుతుదం జెలంగు హరికైవడి నాహనుమంతుమీఁదటన్
గట్టిగ నెక్కి వచ్చె నవకంబుగఁ దమ్ములు దన్నుఁ గొల్వఁగన్. 154

ఉ. వారల లక్ష్మణుం డనెడివాఁడు ధనుర్గుణటంక్రియల్ మహో
దారతమిన్నుముట్ట వివిధస్ఫుటభల్లపటంపరంబుతో
ఘోరతరాహవంబునను గూల్తుశతాస్య నటంచు నన్నుతో
సారెకుఁ జెప్పుచున్ యమునిచందమునం గనుపట్టె నయ్యెడన్. 155

శా. శౌర్యప్రాభవ మేర్పడన్ భరతుఁడున్ శత్రుఘ్నుఁడున్ మిమ్ములన్
ధైర్యం బొప్ప నదల్చి మండుచు వివాదప్రౌఢిబాణాసనా
చార్యుల్ వీరని దేవతల్ వొగడఁగా సంగ్రామముం జేయఁ దా
మార్యత్వంబులు పూని రాఁ దొడఁగి రత్యంతప్రతాపంబులన్. 156

ఉ. రామునినందనుల్ పటుపరాక్రమవంతులు దేవదత్తసం
గ్రామజయజ్ఞు లుగ్రరిపుఖండనశీలు రనేకసాయక
స్తోమవిశాలతూణగణశోభితబాహులు తండ్రిఁ గొల్చుచున్
హామికవచ్చి రక్కుశలవాఖ్యులు దానవవంశవర్ధనా. 157

ఉ. భీషణశౌర్యుఁడై మనవిభీషణుఁడు న్నృపుఁ గొల్చి మిమ్ములన్
దూషణచేయుచుం గణఁకతో నసురావళి తన్నుఁ గొల్వ దు
ర్భాషలమర్మకర్మములు పాయక తెల్పుచు నంతకంతకున్
రోషము పెంచుచు న్విలయరుద్రునికైవడివచ్చు నందులన్. 158

ఉ. *అవి యటనుండని మ్మొకమహాద్భుత మారఘురాముముందటన్
నవజలదంబు చెంగటఁ గనంబడుతీఁగె మెఱుంగురంగునన్
సవినయలీల నెన్నఁదగు జానకిపేరిట నొప్పుకాంత దాఁ
దివిరి నిజేశుతోడ నరుదెంచుచు నున్నది రాక్షసేశ్వరా. 159

ఉ. ఆనునుఁ గొప్పు నాసుమహితాస్య ధగద్ధగ లాశ్రుతిద్వయం
బానఁగ నావెడందనయనాబ్జదళద్దళ లాసునాసికం
బానదు మావళిత్రయము నాఖచదేశసిగన్నిగక్రమం
బానద లామిటారములునౌర యొయారము దానికే తగున్. 160

వ. అని మఱియు ననేకప్రకారంబుల నెఱింగింప శతముఖుండును గోపారుణితలోచ
నుండై తన కనుసన్న యెఱింగి పనులు సలుపు పిశాచమణుల నవలోకించి. 161

సీ. పసిచెద రంభ మీపాలికి ననవిని బలభేదిఁ బొమ్మని సెలవుచేసెఁ
బచనంబుచేసితిఁ బాకయత్నముల్లెల్ల నన నగ్నిఁ గనుసన్న నప్పు డనిచె
రావదేమిటి యింత కావరమా యని మొగిఁ దిట్టి యమునిపై మొక్కలించె
నొంపారఁ దనమనసున నచ్చి నైరుతి వరుణులఁ బొందని కరుణఁబుచ్చెఁ
గీ. గొలువుకూటంబు లూడ్చితిఁ గోరిచూడఁ, బాపుఁ డనవిని పవనునిఁ బనిచి రత్న
రాసులంపిన నలకాధిరాజు మెచ్చి, నౌనర నీశానునొకమూల నొదుఁగఁజేసి. 162

గీ. కొలువు చాలించి రాక్షసకులవరేణ్యుఁ, డందఱను వారివారిక్కల కనిచి లేచి

---

ఉ. *అదియును గాక నొక్కటి మహాద్భుతమై నరనాథుతోడ స
మ్మదమున దానవాళుల మదం బణఁగింప మహోత్సవంబుతో
నదిలిసుతు ల్నుతింపఁగ ననంతరకీర్తి జెలంగ జానకీ
కనకముఁ జూడఁ దెచ్చెఁ దనకంతఁనిగుడి నిశాచరేశ్వరా.

యంతిపురసౌధమధ్యసింహాసనమునఁ, బరఁగఁ గూర్చుండి పడవాళ్లఁ బనిచియపుడు.

వ. తనప్రధానులం బిలువం బనుప వారలును దగినవాహనంబులెక్కి వచ్చి ద్వారప్రదేశంబున డిగ్గి దనుజవల్లభునకు వేర్వేరఁ బ్రణమిల్లి యుచితాసనంబులం గూర్చుండినం గని శతకంఠుం డిట్లనియె. 164

సీ. రాఘవుఁ డనుమహీరమణుండు నాతోడ సాహవం బొనరింతు ననుచు ననుజ
తనుజబాంధవులును దరుచరనిచయంబు మీఱి యింతింతను మేరలేక
వచ్చుచున్నాఁడట వారి నందఱఁ దానె హనుమంతుఁ డనుధీరుఁ డచటఁ దాల్చి
యరుదెంచు చున్నవాఁడట విభీషణుఁడును మనమర్మములు దెల్పుకొనుచు నృపుని

గీ. పజ్జ రాక్షసచతురంగబలముతోడఁ, బూని యరుదెంచెనట యేమిబుద్ధి మనకు
జెపుఁడు మీ చెప్పినట్లు నేఁ జేయువాఁడ, ముట్టివచ్చినకార్యంబు వట్టువడును. 165

సీ. సావిని చిఱునవ్వు నవ్వుచు మంత్రులు పలికిరి దానవభర్తతోడ
యుద్ధ మెవ్వరితోడ నోదవునో యనుచును మామనసుల నెప్పు మలయుచుండుఁ
గానిమ్ము మీపంపు గైకొని పట్టుక నరవానరాదుల నలిఁచివైచి
వంశహీను నమిత్రవాదిని నవ్విభీషణుఁ జంపి హనుమంతుఁ జక్కఁజేసి

గీ. రాఘవుని దేవి జానకీరమణి దెచ్చి, కాను కిత్తుము మీకు నక్కజము గాను
మ మ్మెఱుంగవె మృత్యువుఁ గ్రమ్మఁగలము, సంగరంబున కింత విచార మేల, 166

సీ. పెఱికి తెత్తుమె శేషభీకరదంష్ట్రలు పుడిసిలింతుమె మహాంబుధులు నెల్ల
బెడచేతలో చేతఁ బుడమియు నాకాశ మడుతుమే పొడిపొడి యగుచు రాల
మ్రింగిపత్తుమెపోయి మృత్యువునైనను గూలద్రొబ్బుదుమె దిక్కుంభితతుల
బంధించివత్తుమే పవనునిఁ జలమునఁ బగులవ్రేతుమె కులపర్వతములు

గీ. తృణముమాత్రము రాముని తేజమెంత, వారిసైన్యంబు లన నెంత వారి దెచ్చు
మారుతాత్మజుఁ డన నెంత పోరఁ గూల్పఁ, దమకు నిమిషంబు పట్టదు దానవేంద్ర.

వ. అని యిత్తెఱంగునఁ బ్రగల్భవచనంబుల దనుజేంద్రునిమనసు రంజిల్లంజేసి మఱియును బెక్కుచందంబుల గదలు సాఁచుచుఁ బరిఘుంబులు ద్రిప్పుచు ముసలంబు లూఁచుచుఁ బరశువు లెత్తుచుఁ దోమరంబులు సూపుచుఁ జాపంబులం గుణధ్వనులు గావించుచు శరంబు లేర్చుచు మిన్నుపగుల నార్చుచు ననేకరాక్షసులు సమరంబున కుత్సాహించు చున్న నచ్చెరువంది తొమ్మిదియగడ్తలు చక్కంజేయించి రసాతలంబు ముట్ట జలంబు నింపించి నవప్రకారంబులు సవరింప నియమించి సకలద్వారంబులఁ గాఁపిచ్చి యుంచఁ బోలిః దానవుం డొకకోట నుంచి మొగసాల నుపదిక్షులతో నుండు

మనిష్ఠూలకంఠుని నియోగించి కిన్నరగంధర్వ సిద్ధవిద్యాధర గరుడ నిర్జరపన్నగాదుల
కభేద్యంబుగా గావించి కొలువుచాలించి ప్రధానులం బిలచి దానను తనతల్లి యగుచి
త్రగంధిపాలికిం జని తద్వృత్తాంతం బంతయుంనివేదించియిట్లనిరొ. 168

ఉ. వచ్చెడివాఁడుమర్త్యుడట వానికిఁ దోడటకోఁతిబా రొగిన్
వచ్చిచతుస్సముద్రము లవార్యత వారట వాఁటియీఁడకుం
చెచ్చెర నేగుదెంతురట సేనలదాముసు ఘోరమైనకా
ర్చిచ్చుపయింబడఁ శలభసేన గడంగిన యట్లుకాదటే. 169

చ. అదియునుగాక పంక్తిగళుఁడారఘురాముని దేవిఁ దెచ్చి తా
దుది సుఖవృత్తిలేకమఱిద్రుంగె రఘూద్వహుఁ డిప్పుడుం దగన్
సుదతిని గూడవచ్చెనట జోద్యముగానటుగానవాని పె
ల్లదరఁగఁ జంప సీతఁగొను దండఱు మెచ్చఁగశాశ్వతంబుగన్. 170

చ. అనవినిభీతినొంది తనయాత్మజుఁ గన్గొనిచిత్రగంధియి
ట్లను నకటా తనూభవ దురాత్ములకై వడిపిట్టివాక్యముల్
కనికర మింతలేక పలుకందగునా రఘురాముభార్య నీ
జననిసుమయ్యయన్యసతిచాఁపునఁజూడకు మెన్నిభంగులన్. 171

ఉ. రాముఁడు మోక్షకర్త యలరాముని దేవిరమావధూటి యా
రాముఁ జెనంకి గాదెమనరావణముఖ్యనిశాటులెల్ల సం
గ్రామమునందు గూలుట పరామరిసింపుము మర్త్యవేషుఁడై
భూమినిఁ బుట్టెఁగానిరఘుపుంగవుఁ డాదిని విష్ణుఁడే సుమీ. 172

ఉ. ఆదిని మత్స్యరూపమున నంబుధి నొచ్చియు సోమకాసురు
న్మోది సురల్ నుతింపఁగను ముఖ్యముగాఁ దనప్రాభవంబున
న్వేదము లొప్పఁ దెచ్చి నృపవీరవరేణ్యుఁడు బ్రహ్మకిచ్చెఁదా
వేదవతీపురంబునఁ బ్రవీణత నుంచె జగత్ప్రసిద్ధిగన్. 173

వ. అని మఱియునసేకవిధంబులనతం డవతారంబులు పలుపువిధంబులును మహిమంబు
లును దక్కినప్రకారంబులును సీతయాదిపరంజ్యోతియగుటయును దదీయసామ
ర్థ్యంబును నెఱింగించి వెండియు నిట్లనియె. 174

గీ. ఘనుని రాముని మానవుగాఁ దలంప, వలవ దాతఁడు పూనినవార్థు లెంత
కోటలనఁ నెంప నీ పనుమాటలెంత, అవని కివియెల్లనడ్డమే యక్కటకట. 175

గీ. వెలయునజు నఁముల కుగర్వింపవలవ, గట్టిబ్రహ్మను బుట్టించి నతఁడె యితఁడు

అట్లు కావునఁ నాదేవుఁ డలిగెనేని, పద్మజుని యీవు లెందుకు పనికిరావు. 176

వ. అదియునుంగాక వరంబు లనుకూలంబులైనను నీవు విరించిని గోరునపుడు పురుషుల చేఁ జావులేకుండ నడిగితివి గాని సతులఁ దలంప నేరవైతివి అది యెప్పుడునాహృదయంబునఁ దవిలియుండు. రాముఁడుసీతాసమేతుఁడై యరుదెంచుకారణం బేమొకో యెఱుఁగరాదు. ఆయమ్మమహామాయ గాని సామాన్యమానవకామినిగాదు. ఇక్కలహంబుమాని యప్పురాణపురుషుం డగురామచంద్రుని కెదురుగాఁజని శరణుచొచ్చి బ్రతుకుట మహాకర్తవ్యం బని పెక్కుతెఱంగులం దెలుపరోగికిఁ పథ్యంబురుచింపనితెఱంగుననమ్మాటలు చెవిసోఁకక చూతమెట్లయిననేమిభయం బని దిగ్గనలేచి చని సమరప్రయత్నంబున నుండెనంత[1] రామచంద్రుండును నక్షత్రనిచయంబులనడుమఁ జెలువమరుసంపూర్ణచంద్రుని ధిక్కరించుచు సకలసేనామధ్యంబున రాఁదొడంగె నని విని పింపఁబార్వతీమహాదేవి యటమీఁదివృత్తాంతం బేమయ్యెనని నిజేశుం డగుమహాదేవు నింబ్రార్థించుచుండె నంత. 177

ఉ. శ్రీకరమూర్తి హారి నృపశేఖర నిర్జరబృందవందితా
ప్రాకటవైభవస్ఫుట శుభాకరరమ్య గుణాభిరామ శో
భాకరుణాంతరంగ భవభంజన కౌశిక యజ్ఞపాల యి
క్ష్వాకుకులప్రవర్ధన శివాధిపమిత్ర పవిత్రభాస్కరా. 178

మాలిని కుటిలదనుజజైత్రా గోపతిస్తోత్రపాత్రా, పటుతరవరగాత్రా భానువంశాబ్ధిమిత్రా
ఘటితనిగమసూత్రా గాఢవిద్యావిచిత్రా, భటకవినుతిపాత్రా పద్మినీపత్రనేత్రా.

గద్య. ఇది శ్రీమదేయకూర్తినివాస లక్ష్మీనృసింహాకరుణాకటాక్ష సంప్రాప్త మహాకవిత్వ విద్యాపారీణ సుమహితాంధ్రగీర్వాణభాషాప్రవీణ సంగీతలక్షణధురీణ సకలవిద్వన్మిత్ర శ్రేయసగోత్రపవిత్రధర్మనార్యపుత్ర నిఖిలమహీసురాశీర్వాదప్రవర్ధమానభాగధేయ సకలనృపవిధేయ వినయవిధేయ మర్దననామధేయప్రణీతంబైన సీతావిజయంబనుమహాప్రబంధమునందు ద్వితీయాశ్వాసము సంపూర్ణము.



---

1 ఈక్రిందిరీతిని వ్రాతప్రతిలో నున్నది. ద్వితీయాశ్వాసము ముగియలేదు.

సీ. శ్రీరామచంద్రుండు సీతాసమేతుఁడై కమనీయశరనిరాకరునికరణి
సేనాసమేతుఁడై చెలువొప్పగావచ్చె ననుచుఁ బార్వతికిని హరుఁడు చెప్ప
నమ్మహాదేవియు నద్భుతంబును బొంది యటమీఁదివృత్తాంత మంతచెప్పు
మనినఁ జెప్ప దొడంగె నఖిలవృత్తాంతంబు దాక్షాయణీప్రేమ దనరఁబూని

గీ. సకలకల్యాణగుణమూర్తి సాధువర్తి, వేదవేదాంతతత్త్వార్థవిమలహృదయు
రాఘవస్వామి బలములు రమణఁ గొలువ, వాయుజునిగూడి వచ్చెను వచ్చినపుడు,

# తృతీయాశ్వాసము.

*గీ. శ్రీకరణకార రాజ్యలక్ష్మీవిహార, హార గోక్షీర హీర నీహార తార
తారకాధీశ తార భూధర తుషార, సారకీర్తివిహార వేంచమనృపాల. 1

వ. అవధరింపు మంతఁ బార్వతీదేవికి మహాదేవుం డిట్లనియె. అట్లు సకలగుణాభిరాముం డును రమణీయఘనశ్యాముండును సామాదిశ్రుతసంపన్నుండును ఆపన్నజనకల్ప మహీజాతుండును మహిజాధినాథుండు నగు రఘువల్లభుండు హనుమచ్ఛిరోమధ్యం బున సకలసేనాసమేతుండై వచ్చివచ్చి. 2

మహాస్రగ్ధర. కనియెన్ రామక్షితీశాగ్రణి యచట మహోత్క్రాంతదీపింపఁ జంచ
ద్ఘనసర్పగ్రాహనక్రోగ్రకమఠవిలుఠద్గ్రాహపాఠీనకల్లో
లనటచ్ఛైవాలభాస్వల్లసదసితకలాహారరాజీవషండో
త్కరనదుద్ధూతాస్యదృక్చక్రబకముఖరుతాక్రాంతభద్రున్ సముద్రున్. 3

గీ. అలరి యీరీతిఁ గనుఁగొని యనుజతనుజ, దనుజ మనుజ వనచరసంతతులు గొల్వ
నఖిలవాద్యధ్వనుల్ మిన్ను నదరఁ జేయ, రాఘవుఁడు వచ్చె దుగ్ధాంబురాశికడకు. 4

---

*క. శ్రీరమణీయగుణాకర, కారుణ్యాభవాంబురాశికల్లోలభవ
శ్రీరంజితవరవైభవ, ధారణసత్కీర్తిహార ధర్మనృపాలా.

వ. అవధరింపుము సీతారాములు చతుస్సముద్రంబులు గడచి లంకాపురంబునకుం జని గోపురప్రాకారధర్మహర్మ్యదుర్గంబుల నెట్లు సాధించి రెట్లు దైత్యులిం దునిమిరి తద్వృత్తాంతం బంతయు సవిస్తరంబుగా వినిపింపుమనిన శాంకరీదేవికి శశాంకశేఖ రుం డిట్లనియె.

ఉ. రాముఁడు సద్గుణాకరుఁడు రాక్షసలోకభయంకరుండునున్
భూమిజతోడఁ గూడి పటుభూరితరాక్రమశీలుఁడై బల
స్తోమము లందఱు న్వినఁగ శూరులు మీరలు సంగరంబులో
భీమపరాజయంబులకుఁ బిక్కకయుండుఁడటంచుఁ జెప్పుచున్.

వ. మఱియును సుగ్రీవాంగదహనుమంతజాంబవద్విభీషణులం గని దుర్గంబుల నావర ణంబు సేయుం డని నియోగించి వాలితనూజుం డైన యంగదునవలోకించి యిట్లనియె.

గీ. దక్షిణద్వారమున . . .

చ. సకలధరాధినాథులను సంభ్రమ మొప్పఁగఁ బిల్చి సూనృత
ప్రకటతరోక్తులన్ వివిధభంగుల నాదరణంబుచేసి వా
రక సెలవిచ్చిన న్నృపులు రామునకుం దగ మ్రొక్కి తాము ద
ప్పక బలమెల్లఁ గొల్వఁగ నపారరణక్రియ లుగ్గడించుచున్. 189

చ. పిదప మరుత్సుతున్ సమరభీషణు నీతిగుణౌఘభూషణున్
సదమలభూషణం బిలిచి సారెకుఁ గౌఁగిటఁ జేర్చి ప్రీతి మ
ష్కదనధురీణ! శత్రుమదఖండన! నీమహిమంబుచేఁ జుమీ
యదవద వాసి దైత్యుని శరావలిచే నణఁగించి మించుటల్. 190

ఉ. నీమదిలోనికోరికలు నిక్కమెఱుంగుదు నెన్నిభంగులన్
నేమముగా నొనర్తు నది నే నిఁక నమ్ము మటంచు సీతయున్
రాముఁడు నిచ్చెఁ గోర్కులపరంపరలున్ మణిభూషణంబులున్
వేమఱు వాయుజుండు సువివేకము మీఱఁగ మ్రొక్కి గ్రక్కునన్. 191

చ. మనుజవరేణ్యుచేతఁ బలుమాఱును దీవన లంది గంధమా
దనమున కేగె రాముఁడును దమ్ములు మంత్రులు బంధుమిత్రులున్
ఘనముగ నుత్సహింప నతిగౌరవ మొప్పఁగ రాజ్యభార మొ
య్యన వెసఁ దీర్చుచుండెఁ గరుణాయుతసాంద్రమనస్కుఁడై తగన్. 192

ఉ. ఎవ్వరు నీకథం జదివి యిమ్ముగ వ్రాఁతురు ధర్మబుద్ధిమై
నెవ్వరు విందు రట్టిసువివేకులకున్ రఘురాముఁ డిచ్చు నా
మవ్వపుభోగభాగ్యములు మానితసౌఖ్యము లిష్టసంపదల్
నివ్వటిలం బ్రియంబులును నీరజసంభవసన్నిభాయువుల్. 193

వ. అని యివ్విధంబున శంకరుం డెఱింగించిన శాంకరీదేవి మహాద్భుతంబు నొంది మహాత్మా! యిట్టిచమత్కారకథావిధానం బెన్నండును వినియెఱుంగను నేఁడు శ్రవణానందంబుగా వినఁగలిగెఁ గృతార్థురాల నైతి నని యానందించుచుండె నంత

ఉ. శ్రీరమణీయవైభవ! విశేషగుణాకర! దీనలోకమం
దార! గభీర! ధీర! సముదార! సుకీర్తివిహార! శత్రుసం
హార! యఘప్రహార! సదయానుశరీర! సుధాకరప్రభా
కార! లసద్విచార! జయకారణ! పోచమరెడ్డిభూవరా! 195

మాలిని. ప్రవిమలగుణహారా! బంధురాఘౌఘదూరా!
వివిధశుభవిచారా! విశ్రుతాచార! ధీరా!
కవిజలరుహసూరా! గర్వదుర్వారదూరా!
భువనహితశరీరా! పోచమశ్రీవిహారా! 196

గద్యము. ఇది శ్రీమదేయకూర్తినివాస లక్ష్మీనృసింహ కరుణాకటాక్షసంప్రాప్త మహాకవిత్వవిద్యాపారీణ సుమహితాంధ్రగీర్వాణభాషాప్రవీణ సంగీతలక్షణధురీణ సకలవిద్వన్మిత్రా త్రేయసగోత్రపవిత్ర ధర్మనార్యపుత్ర నిఖిల మహీసురాశీర్వాదప్రవర్ధమానభాగధేయ సకలనృపవిధేయ మర్దననామధేయ ప్రణీతంబైన సీతావిజయంబను మహాప్రబంధంబునందు సర్వంబును చతుర్థాశ్వాసము సంపూర్ణము.

సీతావిజయం బను శతకంఠరామాయణము

సమాప్తము.



చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1928